Bhashamani Series

# దంభప్రదర్శనము

(మహారాష్ట్రభాషనుండి తెనిగించినది)

అనువాదకుఁడు

మాచిరాజు దుర్గాశంకరరావమాత్యుఁడు





పరిష్కర్త : ప్రకాశకుఁడు

చెఱుకువాడ వేంకటరామయ్య

రాజమండ్రి.






[వెల 0—12—0

శ్రీరస్తు

# దంభప్రదర్శనము.



## నాంది

శ్రీశంపారుచిరాంగి పత్యసితశారీరద్యుతిన్ గాంచు న
త్యాశన్ జేసియొనా నెదన్ మృగమదంబాలేపముం జేసికో
భూశోభాన్వితయై సపత్నిపయిఁ జూపుం బ్రేమయుంచెంచు
శ్రీశ్రీశుం డిచ్చుత నీసభాసదుల కెంతే క్షేమసౌఖ్యంబులన్.

గీ. అలి నవమానించిన యాగ్రహమున
దక్షు మాయించె నిజభక్తరక్షకైక
తత్పరుండని భక్తులు దలఁచునట్టి
శంకరుండు బ్రోచుగాత! నీసభ్యజనుల.

(నాంద్యంతమున సూత్రధారుఁడు, ప్రవేశించుచున్నాఁడు)

సూత్రధారుఁడు—(స్వగతము) ఆలోచింపఁగా దక్షయజ్ఞము దాంభిక ప్రదర్శనమేగదా. నిజమగు భక్తిమార్గమును వీడి వ్యర్థమగు వైదిక మతాభిమానము నవలంబించి దేవతలకు సంతుష్టి కలుగఁజేయుటకు మాత్రమే యతఁ డంతటి యాడంబరము పూనెను. నిండు యజ్ఞమండపమున కైలాసాధిపతిని నిందించి జగదంబ నవమానపరచినాఁడు. మొత్తమున పూర్వమునకంటె నిప్పుడు లోకమున సత్యముకంటె దంభ మెక్కుడుగాఁ బ్రబలుచున్నట్లు తోఁచుచున్నది. (ఉలికిపడి) అయిన నాకిప్పట్టున నీవిచారమేల? నా నాటకప్రయోగము నవలోకించుటకై దయతో నీ రసికులిచట సమావేశమైరి గాన నే నిఁక నాటకప్రయోగ మారంభింపవలయును. (తెరవైపు చూచి ఆశ్చర్యముతో) అయితే పాత్రముల సిద్ధముచేయుట మాని

యిప్పు డీమె యెచటికో పోవుచున్న దేమి? (తిరిగి తెరవైపుచూచి ప్రేయసీ! ఇటు రమ్ము.

(నటి ప్రవేశించును. వెంట నొక సేవకుడు పుష్పమాలికలతోడను ఫలములతోడను నిండియున్న రెండు పళ్లెరములతో వచ్చును)

నటి—'ఇటురా' 'అటుపో' ఎందునకీ లేనిపోని రాకపోకలు?

సూత్ర—ఈ ప్రేక్షకమహాజనులు......

నటి—ఇక మీయిష్టము మీప్రేక్షకులయిష్టము ననుమునాకేల నీబాధ. ఎనుబదినాలుగులక్షల జన్మములెత్తినపిదప నీమానవ జన్మము ప్రాప్తించును. ఈజన్మయందైనను కొంచెము, దేవుడని పూజయని యుండవలయునా? వలదా? మోహావేశులయి జనులు సంసారమున నెన్నియో బాధలుపడుచు, నుపయోగములేని భ్రాంతులకులోబడి యజ్ఞయాగాదులు చేయుదురేగాని తమ పాపములను పోగొట్టి యచలమైన మోక్షమును సమకూర్పగల గురుచరణారవిందముల నొక్కరును శ్రద్ధతో భజియింపరుగదా. మహారాజుగారి పాదసేవదక్క నాకితరము లేమియువలదు. మీనటులు మీప్రేక్షకులు నాకు స్వర్గమిప్పించ గలరా?

సూత్ర—(నిరాశతో స్వగతము) ఈమెకు వెఱ్ఱి బాగా తలకెక్కినది. (ప్రకాశముగా) అయిన నీవెంట పట్టించుకొని పోవుచున్న ఫలపుష్పములన్నియు వారికి సమర్పించుటకేనా? కానిమ్ము. మీగురువర్యులెవరు; వారిదేయూరు? ఏమైనా...

నటి—బాగు! బాగు! మీకింతదనుక నీమాత్రమైన తెలియలేదుగా! నేనిపుడిదియంతయు చెప్పుచు నిటనిలచుటకు వ్యవధిచాలదు. మురళీధరేశ్వరాలయములో పురాణము ముగిసినపిదప, స్త్రీజనమంతా మహారాజుగారి హారతికి వెళ్లవలెను. పురాణము కొంచెము విని

మఠమునకుఁ బోవలయునని బయలుదేఱితిని. సమమన్నియు విఘ్నములే. సమయమున కందుకొనఁ గలుగుదునో లేదో వెళ్లెద (సేవకునితో వేగముగా నిష్క్రమించును.)

సూత్ర—(దీర్ఘనిశ్వాసముతో స్వగతము) ఎన్ని యోకంతులు కోసితిని గాని నాకంతియంత నొప్పిలేదనినట్లు; నేనేవిషయమున నితరులఁ బరిహాసించుచుంటినో యిది నేఁడు నాకే సంభవించినది. ఇంకనేమి నాటకము! నాటకములేదు బూటకములేదు (ప్రకాశముగా ప్రేక్షకులతో) మహాశయులారా! తమకుత్సాహభంగమగునని ఖేదపడుచున్నాను. కాని నాబ్రతుకే నాటకముగామాఱు సమయమువచ్చినది. ఇప్పుడు నాకన్యనాటకములెట్లు స్ఫురించును.? నేఁడీదశనాకు సంభవించినది. రేపుమీకు సంభవింపదని యెట్లనగలము. ఏమో! ఒకవేళ నింతకుమున్నే మీరాదశకు లోబడియున్నవారలేమో! గనుక మనవిచేయుచున్నాను. ఇఁక నీ దాంభికుల నుపేక్షింపక, వారికపటవేషములు కపటకృత్యములు బాగుగాకనిపెట్టి వారి నిజస్వరూపములను బయలుపఱచుటయే మనకుఁ గర్తవ్యము. నాభార్య పూజాద్రవ్యములు నైవేద్యము పళ్లెరములతో పట్టించుకొని మురళీధరేశ్వరాలయమునకు వెళ్లినది. నేనుఁగూడ నచటికేగి యీదాంభికుల యాటలెంతవఱకు ముదిరినది తెలిసికొని కార్యక్రమము నిశ్చయించు కొనియెదను.

(నిష్క్రమించును)

---

# ప్రథమాంకము

—:O:—

## ప్రథమరంగము

స్థలము—కుంజరపురములోని మురళీధరేశ్వరాలయము

(పౌరాణికుఁడు పురాణము చెప్పుచుండ, చండికా; అంబికా; కామాక్షి; మీనాక్షి; బసవరాజు; వైదికబ్రాహ్మణుఁడు రామయ్య మొదలగు స్త్రీపురుషులు వినుచుందురు)

పౌరాణికు,డు—ఈప్రకారంగా మహేమంటే శాస్త్రకారులు చెప్పి యున్నారు అయ్యా మన లెక్కేమిటి ఎందుకూ కొఱగాని మనుష్యులము శ్రీరాములవారూ శ్రీకృష్ణులవారూ వీరంతా మహేమంటే ఈశ్వరావతారములే గాదా వారుగూడా మహేమంటే సద్గురు కటాక్షం ప్రధానమని యెంచి యేమంటే మరిన్ని గురుచరణార విందములకు శరణుజొచ్చినారు (శ్రోతలు నమస్కారముచేతురు) సద్గురు! సద్గురు! అస్తు:—

తస్మాద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసుః శ్రేయ ఉత్తమమ్।
శాబ్దే పరే చ నిష్ణాతం బ్రహ్మణ్యుపి సమాశ్రయమ్॥

తమకు మాంచిశ్రేయస్సు మాంగల్యము కలుగవలెనని కోరు కొనేవారు 'శబ్దే పరే చ నిష్ణాతమ్' అన్నారు అనగా యేమంటే శబ్ద మనగా శృతులు స్మృతులు ఇవి యెవనికిని చేతిలోని అద్దమువలె నుండునో, అటువలెనో పరబ్రహ్మయందు దెవరైతే నిష్ణాతలుగా ఉన్నారో అనగా పరబ్రహ్మ నాశ్రయించి యున్నారో అనగా యెవరైతే పర బ్రహ్మను తనకు స్వాధీనపఱచుకొన్నారో అటువంటి సద్గురువునకే యేమంటే యేమంటే శరణుపోవలెను. మన మహారాజుగారి సంగతేమి

జెప్పనూ! కేవళంగా వారు పరబ్రహ్మస్వరూపులు. సరే కొద్దిలో చెప్పే దేమిటంటే, వీరు నా తలిదండ్రులు ఇతడు నా కుమారుడు ఇది నాకుమార్తె వీడు నాయన్నవాడు నాతమ్ముడు అనుకుంటూ ఇహలోకానికి సంబంధించిన మాయాపాశాల్లో మరేమంటే—చిక్కుకోకూడదుమా (కామాక్షివైపు క్రేగంటచూచి) ఇఖ ఆడవారికైతే ఇహమందుగాని పరమందుగాని మాంచి సౌఖ్యము కలుగజేయుటకు గురువువంటి దైవము మరోటి లేనేలేదు. 'తస్మాత్' ముఖ్యముగా కొద్దిలో చెప్పవలసినదేమనగా మన మహారాజుగారంటి గురుశ్రేష్టుల పాదములయందు దృఢమయినభక్తి నిలపండి. మీ హృదయములో వారికి తప్ప యితరులకెవ్వరికీ చోటివ్వకండి.

చండిక—నిజము. అందఱకు మహారాజే గతి. కాక యెవ్వరికెవ్వరు. ఇదియే నే నెపుడును తలచుకొనుచుందును.

పౌరా—ఈ ప్రకారంగా యేమంటేను, సూతులువారు శౌనకాదిమహాపురుషులతో చెప్పినటువంటి వారవుకుంటున్నారు. "కాయేనవాచా మనసేంద్రియై ర్వాబుద్ధాత్మనావాప్రకృతే స్వభావాత్ కరోమియద్యత్ సకలంపరస్మై నారాయణయేతి సమర్పయామి" పుండరీకవరదా! గోవిందా! పార్వతీపతయే! హరహరమహాదేవ! సీతాకాంతస్మరణ! జయరామ్. శ్రీసద్గురునిత్యానంద మహారాజుకీ జయ్! గురువేనమః గురువేనమః గురువేనమః (గ్రంథముకట్టుచు రామయ్యనుజూచి)

ఏమండీ! రామయ్యగారు కుశలమేనా? ఈనాఁడు మొదట తమునను నేను పోల్చలేకపోతిని. (రామయ్య కప్పుకొనిన శాలువను వ్రేలితో చూపుచూ) ఇంత గొప్పమహావస్త్రమును బహుమానమిచ్చిన యజమానుని నీవీవేళ యెచట సంపాదించితివి.

రామయ్య—శాస్త్రులుగారు! విద్వాంసుల నింతగౌరవించే యజమానులు యిప్పుడెచ్చట నున్నారు? ఇది తమ సంస్థానదేవతయిచ్చిన బహుమతియే. మీతో యేమని మనవిచేయను. మహారాజుగారనిన రెండవకర్ణుడే. దానకర్ణుడు మీరేమను కొనిరో.

పౌరా—(స్వగతము) అంగడిలోని బెల్లము గుడిలోని లింగమునకు నైవేద్యము (ప్రకాశముగా) పూర్తిగా యథార్థముగా సెలవిచ్చారు. అయ్యా! ఈ కల్పవృక్షము తనంతట తానే మనయింటికి వచ్చినది. ఎవరిభావనలను బట్టి వారికి ఫలమిచ్చును.

బసవరాజు—సత్యమే. శాస్త్రులుగారు! యద్భావం తద్భవతి.

పౌరా—సరి. రామయ్యగారు! ఇంక పోవలయును గదా.

రామయ్య—తమరు ముందు నడచుచుండుడు. శాంతిపాఠ మొకటి చెప్పి నేనును మఠమునకు వచ్చెదను.

(పురుషలందరు నిష్క్రమింతురు. ముత్తయిదువులు పసుపు కుంకుమల నిచ్చుకొందురు కామాక్షి బయలుదేరును)

చండిక—ఓహో బాత్తిగా కొంగు కొంగున ముడివై చికొనినట్లు వారి వెంబడినే వెళ్లవలెనా? ఏమి! కామాక్షమ్మా! కొంచెము ఆగితే సరిపడదా?

కామాక్షి—కాదు! కాదు! సరిపడకేమి. చండికమ్మా! ఇంటిపను లన్నియు నట్లనే పడియున్నవి.

అంబిక—ఇంటిపనుల కేమిలే. అవి యెప్పుడు మననెత్తినిరాసి పెట్టినవే. దేవుడు వ్రతము అని యెంతమాత్రము తోచనివ్వవుగదా, పూచికపుడకంతయైనను సౌఖ్యమును దొరకనియ్యవు.

కామాక్షి—అంబమ్మగారు! మీరు దేని దేనిని సౌఖ్యమనెదరోగాని.

గీ. కలవు గృహమందె సర్వసౌఖ్యములు నిజము
పరమభక్తిని జీవితేశ్వరుని గొల్చి
యతనిప్రేమకు నాస్పదమయిన యతివ
కిహాపరసుఖమ్ము లఱచేతనెసఁగుఁ గాదె?

ప్రేమ యొకటియుండిన దానితోడనే సకలసౌఖ్యములు నుండును.

అంబిక—ఎందుకా పసలేనిప్రేమ. ఆసౌఖ్యము తగులబెట్టనా! పొయ్యి కడ చేతులు కాల్చుకొనుట అంట్లుతోముట ఎంగిలి కంచములు కడుగుట కుళ్లుగుడ్డలుతుకుట; వీటికి సాయము చీమిడి ముక్కు సంతాన్నము గుదికట్టకూడా మెడలోబడిన, అడిగితివా ఆసౌఖ్యము. బ్రతికియుండగానే నరకములోఁ బడినట్లేగదా! లెమ్మన లేవవలె కూర్చుండుమనిన కూరుచుండవలెను. ఈ విధముగా రేయుంబగల్లు బాధపడడము సౌఖ్యమేనా? నీవేమన్ననుసరే. స్త్రీజనము నుదుట సౌఖ్యములేనేలేదు. జన్మమే పాపిష్ఠిజన్మము.

కామాక్షి—పోనిమ్ము పాపిష్ఠిజన్మమే కానిమ్ము. మనకు కావలసిన జన్మ కోరినవచ్చునా?

అంబిక—నేనును, అదే చెప్పుచున్నాను పూర్వజన్మమున చేసిన కృత్యములను బట్టి ముందటి జన్మవచ్చును. ఇదియంతయు యెవరైనను మనస్సు విప్పి చెప్పినగాని తెలియదు. అందుకొఱకే మహారాజుగారి కాళ్ళుపట్టుకొమ్మని యొక్కతీరుగా నీతో మొఱ పెట్టుకొనుచుంటిని.

కామాక్షి—అంబమ్మా!

సీ. ప్రాణేశుఁడనుకల్పపాదపమదియుండఁ
బెరవృక్షములనీడ వరయనేల
పతిపాదజలముతన్ బావనమొనరింప
నితర నీరమ్ముల వెదకనేల
ధవుఁడను ధనదుండు తనచెంతనుండఁగ
నన్యమానవుధనం బడుగనేల
భర్తృసేవయె మోక్షపథము చూపుచునుండ
వేరొక్క గురువరుఁగోరనేల
గీ. నాథుఁడే యంగనకు జగన్నాథుఁడగుచు
నీశ్వరుఁడయి సతికి జీవితేశ్వరుండు
వాంఛితార్థప్రదుండయి వరలుచుండ
నితరదైవతపూజన మతివకేల!

సీత, మండోదరి, ద్రౌపది, వీరినిబోలు పతివ్రతలేగురువుల పాదములు పట్టుకొనిరి! భర్తయే వారిదైవము.

చండిక—భర్త భర్తయని యూపాడుచుమొగవారిని గొప్పగా బల్కుచుంటివే! అయితే, కామాక్షమ్మా! నీవు బసవరాజుగారి గురూపదేశం పొందెదవా? మగడే గురువుగారయ్యె యెడల యింటింటా కావలసినంత మంది గురువులగుదురు.

అంబిక—మరి, సీత మండోదరీ అని పెద్దపెద్ద పేర్లు యెన్ని చదివితివి?

చండిక—ఆవిడకు తెలిసిన పేళ్లన్నియు నేకరువు పెట్టినది. అయితే శ్రీరాములవారు వసిష్ఠులవారి మాట దాటనప్పుడు సీతామహాలక్ష్మి యతనికి సాగిలపడకుండక యుండవచ్చు. ఇవి పుక్కిటిపురాణములు కావా?

కామాక్షి—సరియే. అదటుంచుము గురువులయందుండు అర్హతయేమి ?

చండిక—అర్హత యేమిటా ? మా మహారాజుగారి దర్శనము చేసిన తర్వాత తెలుస్తుంది. ఆదిబ్రహ్మాండమంత దేహకాంతి సిద్ధించినట్లు కనుబొమలు. విశాలమైన నుదురు. అతిలలితము. అసంభాషణ. ఎంత అందముగా నుండుననుకొంటివి. ఇంక స్త్రీజనములతో నాతడు మాటలాడు విషయమును చెప్పుటకే వీలులేదు. ఒకటా ! రెండా ! గురువున కెన్నియో లక్షణము లుండవలయును.

అంబిక—మంచిమాట. భర్తనే గురువుగా భావించినచో నెట్లు ? సంసారమున నాడువాండ్రకు చీటికిమాటికిని అనృతములు లాడవలసియుండును. సమయమువచ్చిన వెనుకముందులాలోచింపక మగనితో కపటముగా ప్రవర్తింపవలసియుండును. గురువుతో సంతోషముగా, ఆయనతో నబద్ధము నాడరాదు, కపటకృత్యము లాచరింపరాదు. పెనిమిటి పెనిమిటియే; గురువు గురువే; ఎన్నటికిని కాని, చండికమ్మా ! మీరు చెప్పిన లక్షణములు మాత్ర మతనియందుండవలయును.

చండిక—అగును. ఉండితీరవలయును. లేకపోతే గురువులెచట బట్టిన నచ్చుటనే పక్కురున్నారు. కాని యొకడైనా మంచివాడుంటే ఒట్టు. ఒకనికి మూతివంకర. మరియొకనికి కన్నులొట్ట, యొకనికి ముడతలశరీరము మరియొకడు కారుసలుప్పు. మొన్ననే యూరికూలిపోయిన పాతసత్రములోని కొక ముసలినాథుడు వచ్చి దిగినాడు...

అంబిక—ఏమి అవతారమమ్మా వానిది. అబ్బే !

చండిక—కామాక్షమ్మా. ఆతని దేహమున జేనెడు జేనెడు, యెలుగుగొడ్డులాగు రోమములు. వాని శిరస్సు వక్కలుగాను, దర్శనము

నకు వెళ్లినవారిమీదికి కుక్కలాగ 'యిస్కో' మని యెగబడడమే. ఇంక దర్శనమేమిటి ?

అంబిక—వీళ్లేమిసాధువులు లేవమ్మా. బ్రతికియున్న భూతములు. మన మహారాజుగారి మనస్సు యెంతమెత్తన. చండికా ! యివ్వేళ. చూడలేదా? మహాపూజ ముగిసిన పిదప నందఱు వెడలి మన మైదుగురము వెనుక నిలచిపోయినప్పుడు—— ——

చండిక—నిజమే ! కామాక్షమ్మా ! మాకు తిరిగీపంచామృతములతో పూజచేయవలయునని యున్నదని మేమనినంతనే పాపము ! తిరిగీ పూజ చేయించుకొన్నారు. ఆపూజ చేయించుకునే సమయమున నాయన యెంత గట్టిసమాధిలోనున్నాడనుకొంటివి ! మాకందఱకు నెంత ధన్యులమైతిమా అనిపించినది. ఇంక నదేమీ యడగకు.

అంబిక—వారు అటువంటివారు కావుననే బసవరాజుగారైననేమి మరెవరైననేమి, వారికి సాష్టాంగదండము లాచరింతురు.

చండిక—సరే. మగవారి విడ్డూరములు మహ చెప్పుచున్నావు. మన మీనాక్షివంటి గొప్ప గొప్ప స్త్రీలు, మన మహారాజుగారికి సేవజేయువా రెంతమందిగలరు !

అంబిక—నిజమే. కామాక్షమ్మా ! ఆమీనాక్షి వంటిమీద, గం పెడునగలుండును. ఎంతపెద్ద చంద్రహారమమ్మా ఆవిడది.

చండిక—అదేమీలేదు. కామాక్షమ్మా ! యీపట్టు పనికిరాదు సుమా ! నీవింకనూ గడుపవలసిన దినములు చాలా యున్నవి. బోలెడుమందిపిల్లలులేకున్న మానెగాని మనసుతీరుట కొక్క పసి కూనయైన కావలయునా వలదా ? చూడుమటే; మహారాజుగారి యనుగ్రహముతో నంతయు చక్కబడునో లేదో !

కామాక్షి—ఎవరిమంచి వారికి చేదా ! మహారాజుగారి యుపదేశము తీసుకొమ్మని మీరింతగా చెప్పుచున్నారు. మావారు కూడా అంటూనేయున్నారు.

చండిక—ఇంక, అట్లయిన నీగృహకృత్యములకు వేయిదణ్ణములు తలివమ్మా అందరిమాటకేమిగాని మీ బసవరాజుగారికైనా నీమంచిచెడ్డలు తెలుసునా లేదా ? ఇప్పటికైనా కష్టము తెలిపినారు. చాలు—పద నీవెంట మీయింటికి వస్తాను. పనులు పనులంటే మెన్నయుండును. ఇద్దరమునూ కలసి చేసితిమా నిముషములో అయిపోతవి. ఇద్దరమునూ అప్పుడు కలసియే మఠమునకు వెళ్లుదాము. కావలిస్తే రాత్రి ఫలహారము మఠములోనే చేసుకోవచ్చు.

కామాక్షి—మీరు రావలదు. ఇంటికి వెళ్లి దీపారాధన వెలిగించి దేవునియింట దీపము పెట్టి మావారితో కలసియే మఠమునకు వస్తాను.

చండిక—కామాక్షమ్మా ! అదృష్టమంటె నీది. నీవు మఠానికి రావడమున్ను, ఇవ్వేళనే గురుపున్నమ కావడమున్ను. ఎట్లు కలసివచ్చినదో చూడు.

(తెరలో ఢంకా మ్రోగును)

చండిక—అమ్మయ్యో! హారతి యిచ్చేవేళ అయినది. కామాక్షమ్మా! నీవు యింటికి వెళ్లి తిరిగి వచ్చేలోగా హారతి యివ్వడముకూడా అయిపోతుంది. ఇంట్లో దేవునియొద్ద దీపము యెవరైనా పెట్టెదరులే. నీ విట్లాగే యిప్పుడే మఠానికి పద. బసవరాజుగారు కూడా వస్తారులే.

కామాక్షమ్మ—సరే. నడువు—

(చండికా; అంబికా; దేవాలయములో దేవుని దర్శనము చేయుచుందురు)

కామాక్షమ్మ—(స్వగతము)

గీ. మానసం బిప్డు సంశయ మగ్నమయ్యె
సతికిఁ బతిభక్తియే మోక్షసాధనమని
శ్రుతులు పచియింప, నే నన్యచింతఁ దగిలి
తత్పథమ్మును విడువంగఁ దగునె తగునె!

(అందఱు నిష్క్రమింతురు.)

---

## ద్వితీయ రంగము

---

స్థలము కుంజపురమున రాధారి.

విద్యాధరుఁడు ప్రవేశించును.

విద్యా—(తనలో) ఈనాటకవేషధారి మాగ్రామముఁ బ్రవేశించి గురువును గురువును అని యూరేగుటయు మాకుపదేశములు దీక్షలు నిచ్చి మమ్ముల నుద్ధరించుటయునా? వీరా మోక్షగురువర్యులు! నీచురాలగు వేశ్యవలె తాను ధరించిన వస్త్రమునకు ముడుతలు పడలేదుగదా యనియు తన శిరోజములు రేగియుండలేదుగదా యనియు, వేసికొనిన తమ్ముల మెత్తబడినదా లేదా యనియు తన్ను తాను చూచుకొనుటయందే వీ డహోరాత్రములు మగ్నుఁడై యుండును. వీనికి పరమార్థ మేమిటి. కాని వీని వేషములకు మోసపోయి యమాయికురాండ్రగు స్త్రీలు—స్త్రీలే కాదు యీ నగరములోని బుద్ధిహీనులగు పురుషులును పెక్కుమంది

గీ. బుద్ధిహీనత దాంభికపురుషకపట
జాలములఁ జిక్కి ద్రవ్యనష్టమును బొంది
గృహసుఖమ్ములఁ గోల్పోయి యెట్టకేల
కథమగతి పాలుపడుచుండి రకటకట!

వీరిని గుఱించి యింతవఱకు దూరమునుండియో యూరక విను చుంటినిగాని నేను ప్రత్యక్షముగా చూచుట తటస్థించినందున నీటక్కరి దాంభికుల యాట లెంతవఱకు సాగినది కొంత గ్రహింపఁగలిగితిని. ఇఁకమీఁద వీరి నుపేక్షించుట బుద్ధిపూర్వకముగా స్వసమాజమునకు ఘాత యొనర్చుటయే యగును. వీరి నింక నెంబడింపవలసినదే. (ముం దునకుఁ జూచి) చంక నేదియో నిడికొని యతిత్వరతో వచ్చుచున్న యాతఁ డెవఁడు? (బాగుగా జూచి) ఓహో! వీఁడా! పౌరాణికుఁడు. ఈ చట్టములోనివాఁడే. వీని దుష్టవైఖరి యుట్టిపడుచున్నది. కానిమ్ము ఏ డప్రయత్నముగా నెదురైనవాఁడు. వీనిని కొంచెము పలుకరించి యేమయినా యాచోకీ చిక్కునేమో చూచెదను. వీఁడు నాకంటె పన్నము లెక్కువ తిరుగవేసినవాఁడే! ఏదో పాచిక పాఱునేమో చూచెదను. (పౌరాణికుఁడు బాబిగానితో మాటలాడుచుఁ బ్రవేశించును)

పౌరా—చూడరా! బాబిగా! మహారాజుగారి సేవ నీ కనాయాస ముగా లభించినది. వా రీ ప్రపంచమును నడుపుదురు. వా రేమి తలచిన నట్లగును. వారు మాకు బుద్ధిపుట్టించిన రీతిని మేము నీకు చెప్పుచుందుము. మేము చెప్పినట్లెల్ల మాఱుమాటాడక నీ వాచ రించుచుండినచో నీవు బాగుపడెదవు.

బాబి—తమరు సెప్పిందల్లా సేస్తాననిపురాణంసామీ! నానువకటే మాట అడగతాను. సెప్పండి.

పౌరా—అదుగో; అదేవలదంటిని. ఏమియునడుగవలదు. నాకుతొందర పనులున్నవి. నీవువెళ్లి నీపని చూచుకొనుము. పొమ్ము.

(బాబి నిష్క్రమించును)

విద్యా—(పౌరాణికునిజేరి) నమోన్నమః. శాస్త్రులవారు! ఎచటికి బయలుదేరినవారు? పురాణము ముగిసినట్లున్నది! ఇంక నింతతొం దర యేల?

పౌరా—అయ్యా! మీరూ పొట్టకొఱకు.

విద్యా—అయితే! శాస్త్రులవారు! ప్రాణిమాత్రులకిది యున్నదే గదాండి?

చ. వనజములోనఁజొచ్చి మధుపానముచేయును దేంట్లు; వ్యాఘ్రముల్
వనమున నల్పజంతువులఁబట్టివధించు; హరించు ధాత్రి దు
ర్జనుడొరువిత్త మున్న యుదరమ్మును నింపుకొనంగనైన స
జ్జనులని సత్పథమ్మని ప్రశంసగొనెదర్పగ జాలరింతయున్.

పౌరా—ప్రాతరాహ్నికములు తీర్చుకొని రెండుఘడియలు కొపేశ్వరాలయములో శ్రీమద్భాగవతము చదువుదును. సాయంకాలము రెండుమూడు ఘడియలకాలము మురళీధరేశ్వరాలయములో గడపవలసియుండును. అచట కృష్ణలీలలు చెప్పెదను. పగటిపూట కొంచెము విశ్రాంతి గైకొనుటకు వీలుండునుగాని, యెచటికైనను వెళ్ళవలసి వచ్చినచో నదయునుండదు.

విద్యా—అయితే యందులోస్వార్థము పరమార్థము......

పౌరా—అదుగో అదియే సమాధానము. అనగా శ్రోతలకుపదేశము మనకు నామస్మరణ. అందుచేతనే యేమియు కష్టమనిపించదు.

విద్యా—అదియునుగాక దానివెంటనే మన యోగక్షేమము కూడను.

పౌరా—సాగనీయుడు; మీ వినోదము.

విద్యా—అయ్యా! ఉదయము సాయంకాలముల మాటకేమిగాని పగటిపూట మాత్రము కొంచెము విశ్రాంతియుండవలెను సుమండీ!

పౌరా—ఈసంసారము నిస్సారము. ఎండమావులవలెనది మానవమృగములను మోసపుచ్చును. మోక్షమార్గము సత్సాంగత్యమువలన దక్క మఱియొకదానివలన లభింపదు.

విద్యా—(తనలో) లేక విషయాసక్తియా

పౌరా—(మెల్లగా) ఇటీవల పగటిపూట నాలుగుఘడియలు మఠములో గడపుచున్నాను. మహారాజుగారి సేవవలన సంతవఱకైన చిత్త శాంతి దొరుకుచున్నది. అంతేచాలు.

విద్యా—మహారాజా! మహారాజనగా? ఓహో! యీ సమీపమున నున్న మఠములోనివారా? కీర్తిమాత్రము చాలావిన్నాను బహు యోగ్యులయిన మహాపురుషులని చెప్పుకుంటారు. కాని యీవఱ కింకానాకు వారిదర్శనము మాత్రము......

పౌరా—అదుగో అదే. తమబోంట్లకు పరమార్థ విషయములలో శ్రద్ధతక్కువ. అందుచేతనే మాబోంట్ల కీదశపట్టింది. వారి గ్రామ మునకువచ్చి యథమపక్షము రెండేండ్లు గడచియుండును. మా గ్రామములోని వయోవృద్ధులు జ్ఞానవృద్ధులు నెందఱో మహారాజు గారి దీక్షనవలంబించిరి. బసవరాజుగారిసబోలు గొప్పగొప్ప ధనికు లకుకూడ మహారాజుగారి మాటయన్న వేదవాక్యము...

విద్యా—(తనలో) ఆ తెలివిహీనుఁ డందఱికంటె ముందుగానే తమ వలలోపడవలసినవాఁడే.

పౌరా—పరిస్థితు లిట్లుండగా యింతవఱకు మీరు వారిదర్శనమైనా చేయలేదంటారే!

విద్యా—ప్రారబ్ధము.

పౌరా—ఇప్పటికైనా మించిపోలేదు.

విద్యా—అయితే చూఁడండి శాస్త్రులవారూ! అన్నివిధముల మీదే భారము.

పౌరా—(తనలో) ముందు నీవంటివానికేగదా ముక్కుతాడు వేయ వలసినది (ప్రకాశముగా) సరే. అయితే సాయంసంధ్య వార్చుకొని నేను మఠమునకు వెళ్లెదను. అపుడు తమరుకూడ నావెంటరండు.

తమతో నేనేమని మనవిచేసుకొందును. ఆహా! మహారాజుగారిని గుఱించి తమతో నేనెంత చెప్పినను సహస్రాంశముకూడ కాజాలదు.

విద్యా—ఔనౌను. అట్లేవింటిని.

పౌరా—క్లుప్తిలో చెప్పడమేమంటే; మనవంటి పాపాత్ముల నుద్ధరించుటకు సాక్షాత్తు పరమేశ్వరుడే యవతరించినాడనవచ్చును.

విద్యా—మహారాజుగారి దర్శనము తప్పక చేయగోరుచున్నాను. శాస్త్రులవారు! తమ సంధ్యావందనముగులోపల, యింటివఱకును వెళ్లి తిరిగి తమ బసలోనే నేను తమను కలుసుకుంటాను.

పౌరా—చిత్తము. చిత్తము. (నిష్క్రమించును.)

విద్యా—(తనలో) ఇది బహుబాగుగా కలసివచ్చినది. ఏమిటి! శ్రోతలకుపదేశము తనకు నామస్మరణయునా? ఓరిదాంభికా!

గీ. దాంభికులు నీచులును ఖలుల్ త్యాజ్యులరయ
నంతరంగంబు వారిది హాలహాలము
పల్కుమఱి చిన్నిపూదేనెపల్కుచూడ
మూఢులవ్వారిచే జెడిపోవుచుంద్రు.

(నిష్క్రమించును)

---

## తృతీయరంగము

---

స్థలము కుంజపురములోని మఠము

(మహారాజున్నతాసనమున కనులుమూసుకొని సమాధిలో కూర్చుని యుండును. అంబికా, చండికా, పూజాద్రవ్యము లమర్చుచుందురు. కామాక్షి, చండిక, పార్శ్వమున నిలబడియుందురు, మీనాక్షి మహారాజునకు ప్రదక్షిణము చేయుచుండును. బసవరాజు సాష్టాంగప్రణామము చేయుచుండును. సోముడు చేత లాంతరు పట్టుకొని ప్రక్క

ను నిలవఁబడియుండును. నాగి వాని ప్రక్కనే మీనాక్షి శాలువప్పు కొని నిలచియుండును.)

(పౌరాణికుఁడు, విద్యాధరుఁడు ప్రవేసింతురు)

మహారాజు—(సమాధి విసర్జించినట్లు నటించి) సచ్చిదానంద ! సోహం! సోహం ! (కొంచెము మౌనమువహించి) యోగనిదురవలన చిత్తమున కెట్టిశాంతి కలుగునో యది ప్రత్యక్షముగా ననుభవములేనిదే యెంతమాత్రమును గ్రహించుట శక్యముకాదు. ఈ సంసారమున మానవుం డెన్నియో కష్టములనుభవింపవలసి యుండును. అందు వలన చిక్కులి చిత్తక్షోభము సంభవించును. ఆ క్షోభమును కొంత వఱకైన నశింపుచేయుటకు మనుజునకు నిద్రావస్థయనునది పరమేశ్వరప్రేరేపణవలన సంప్రాప్తమై యున్నది. అయినను తదవస్థయందు నిజమైన శాంతిసౌఖ్యమనుభవమునకు వచ్చునా? రాదు. జాగ్రదవస్థయం దుండగా మానవుడేమంచి, చెడ్డవస్తువులను చూచునో యేకార్యములను చేయునో యవి స్వప్నావస్థయందు ప్రతిఫలించి వానిశాంతిని భంగపఱచుచుండును. నిద్రావస్థయందును మానవుడు విషయాసక్తచిత్తుఁడై యుండునని నమ్మవలసియున్నది. సమాధిస్థితియందలి శాంతికి భంగమనునది యుండనేయుండదు. ఈ సమాధియందు జీవునకు సచ్చిదానంద స్వరూపునితో నైక్యత సంప్రాప్తమయి వాడు పరమేశ్వరుని యంశమగును. ప్రతిజీవునకును యీ స్థితి సంపాదించుకొనుట శక్యముకాదు. ఏమన.

గీ. ఎంతవాఁడును జనుఁడు విభ్రాంతుఁ డగుచు
భవమను జలనిధి నరిషడ్వర్గమనెడు
జలచరమ్ములకును జిక్కి చాల స్రుక్కి
యాశ యనెడు నక్రముచేత నంతరించు.

పౌరాణికుఁడు—ఆహాహా! భక్తిజ్ఞానవైరాగ్యములతో నిండిన మహా రాజుగారి యుపన్యాసము పాపములను పాఱదోలు త్రివేణీసంగమముగదా!

మహారాజు—మనుజుని సుకృతమువలన వానికి సత్సాంగత్యమలవడి, తత్సాంగత్యోపదేశమున వానిహృదయము సన్మార్గమున ప్రవర్తించినయెడలనే క్షణభంగురమైన యీ ప్రాపంచికసౌఖ్యములను విడనాడి పరమార్థసాధన చేయవలెనని వానికి బుద్ధిపుట్టి వానికి మోక్షప్రాప్తిహేతువగును. ప్రతిమానవుఁడును నహంభావమును వదలి సత్సాంగత్యముకొఱకు పాటుపడుచుండవలెను. సచ్చిదానంద!

విద్యాధరుఁడు—(స్వగతము) చిలుక బాగుగనే పలుకనేర్చుకొనినది.

చండిక—చూచితివా? కామాక్షమ్మా! మహారాజుగారు ఎంతపెద్ద వేదాంతము నుపన్యసించుచున్నారో, నిజముగా నిపుడు మహారాజుగారికి దృష్టి తీయవలసినదే.

మహా—(బసవరాజుతో) నియమానుకమముగా జపమును ననుష్ఠానమును జరుగుచున్నవి గదా!

బసవ—మహారాజుగారు సర్వజ్ఞులు. అంతరజ్ఞులు. వారితో నీదాపుడేమని మనవిచేయగలఁడు? నేను దృఢమయిన భక్తివిశ్వాసములతో యీ పాదముల నాశ్రయించియున్నాను. నన్ను కృతార్థునిగా చేయవలెనని యీ చరణసాన్నిధ్యమున నెల్లప్పుడు ప్రార్థించుచుంటిని.

మహా—మీ మనోభీష్టములన్నియు సమకూడి త్వరలోనే తమకొక కుమారుఁడుద్భవించి మీ వంశము నుద్ధరించును.

రామయ్య—ప్రత్యక్షముగా మహారాజుగారే యనుగ్రహించినప్పుడేమి కానేరదు!

చండిక—వింటివా, కామాక్షమ్మా! నీ కోరిక నెఱవేరినది సుమా.

విద్యా—(తనలో) బాసనకొడుకులు సామాగ్రి బాగుగానే తయారు చేసి యుంచినారు.

పౌరా—బసవరాజుగారూ! నిజముగా తమరు గొప్పయదృష్టవంతులు సుమండీ? అయ్యా సంవత్సరములనుండి సేవించినను కార్యము సిద్ధించడము సాధ్యముకాదు సుమండీ.

విద్యా—(తనలో) ఏమి? యీ పలుగాకుల పన్నుగడ! చూడగా జూడగా నీ ముదిసలివాని కిప్పుడే పుత్రులుపుట్టి వీనివంశముద్ధరింప బడినట్లే యున్నది.

చండిక—కామాక్షమ్మా! నీకు చక్కని చుక్కలాంటి పిల్లవాడు పుట్టునుసుమీ. మహారాజుగారిమాట యెప్పుడైన నబద్ధమయినదా?

రామయ్య—మీ కొమారునికి నామకరణము మఠములోనే చెయ్య వలసియుండును సుమండి. బసవరాజుగారూ! అప్పుడు గొప్పబ్రాహ్మణసంతర్పణ కూడా జరిగింపవలసియుంటుంది.

పౌరా—శ్రీదేవిని స్థాపనచేయుటకు వజ్రములు చెక్కిన గండకశిలా సింహాసనము మహారాజుగారు తయారుచేయించినారు. మీరది చూచియున్నారు గదా! బసవరాజుగారూ! మహారాజుగారు చేయుపనుల నెంతపొగడను! అన్నివిద్యలు నన్నికళలు నటువలెనే యిష్టసిద్ధులు విధేయతతో చేతులుజోడించుకొని వారిముందు నిలువబడియుండును. వారికేమి కొఱత.

విద్యా—(తనలో) శ్రీదేవి సింహాసనమా? లేక బసవరాజు సమాధియా? (పౌరాణికుడు విద్యాధరుని ముందుకు వెళ్లి మహారాజుగారికి మ్రొక్కుమని సైగచేయును విద్యాధరుడట్లు చేయగా)

మహా—(చేతులు పైకెత్తి దీవించుట నభినయించును) సచ్చిదానంద! సోహం!

రామ—ఓహో! విద్యాధరుడుగారా! తమ రీదినముననే మఠమునకు దయచేసినట్లున్నారు.

విద్యా—చిత్తము. ఇదియును ఋణానుబంధమే కాదండి. పూర్వసంచితము తుదముట్టవచ్చినప్పుడుగదా యిట్టిసందర్భములు సమకూడుట.

మహా—(పౌరాణికునివైపు చూచి) హుం హుం, (విద్యాధరు డెవరని చేతితో సైగచేసి యడుగును)

పౌరా—వీరునూ కాంజపురపు కాపురస్థులే, విద్వాంసులు. మంచి యోగ్యులు. మహారాజుగారి కీర్తివిని దర్శనము చేసుకొనుటకు వచ్చియున్నారు.

విద్యా—(పౌరాణికుని చూచి) ఎట్టి దర్శనముతోనే......

రామ—అనుగ్రహము కావలెనంటున్నారు. అవుతుంది. అవుతుంది.

మహా—అవును. క్రమేణా అన్నియును కాగలవు. కాని గురుసేవావ్రతమనునది, అసిధారావ్రతముకంటె నెక్కుడు కఠినమైనది.

చండిక—నిజంగా చాలా కష్టమునుమా.

మహా—ఈత్రివిధమైన జగత్తులో ఈవ్రతమాచరించునపు డనేక విధములయిన బాధలు కలుగుచుండును. నాస్తికుల సాంగత్యమువలన, నానావిధములయిన తర్కవితర్కము లుద్భవించి మనసు కలత చెందును. ఈబాధలన్నియు నతిక్రమించి యేకాగ్రమైన భక్తినిష్టలతో సేవచేసిననే యది ఫలప్రదమగును. ఈసంగతులు మనమున నిలుపుకొని ముందడుగువేయుట మేలు.

విద్యా—మహారాజుగారు పూనుకొనినచో మనోనిగ్రహము గలిగి పూనినకార్యమునకు తటస్థించు బాధకములన్నియు తమంతట తామే పటాపంచలగును.

(తెరలో శృంగనాదము)

చండీక—అమ్మయ్యో! మహారాజుగారి పాన్పువేళ యయినది. కామా క్షమ్మా! ఇపుడు హారతి యివ్వడము నీవంతు సుమా. పొద్దుట మహాపూజవేళ సాయంకాలము సంధ్యాహారతివేళ, పాడుమగవారి మంత్రతంత్రాలతో విసుగుపుట్టుచున్నది.

రామ—మంత్రాలు తంత్రాలుకూడా కావలసినవే గాదుటమ్మా చండికపిన్నీ!

చండి—మీ రేమన్నను సరే కాని రామయ్యగారూ? మాపూజయే మహారాజుగారికి చాలా యిష్టము. కాని, మేమే యెవరమయినా చెయ్యవలెను. నిన్న ఆనర్మదమ్మ—అబ్బే యెంత అనాకారమ్మా! ఆమె;—పూజచేయుటకు ముందునకు వెళ్లినతోడనే, మహారాజు గారి వదనము యెల్లాగో అయినది. అది చూడగానే నాకు కళ్ల వెంట నీళ్లు తిరిగినవి.

విద్యా—(తనలో) ఇది బాగుగానే గడితేరినది.

చండిక—ఇంకనెన్నడు యిల్లాంటివి జరగనివ్వము. పద కామాక్షమ్మా! నీవుపద; ఇదుగో పూలదండ (దండనిచ్చును) మహారాజుగారి మెడలో నాదండవెయ్యి, ఈచిన్నదండలు వారి చేతికికట్టు. (కామా క్షమ్మ సంకోచించును) అబ్బోయింత సిగ్గుపడనక్కరలేదు. వేద్దూ; వారి మొగమున బాగాదిద్దినట్టు లీగంధముపెట్టు తరువాత నీ పంచా రతితో హారతియియ్యి. అంతలో నేనువెళ్లి పూలపానుపు బాగా అమరిచినారో లేదో చూచివస్తాను.

(చండిక నిష్క్రమించును)

బసవరాజు—(కామాక్షమ్మనుచూచి) ఓసీ! ముందునకుపో! ఎంత పుణ్యమో చేసుకోనిదీ యిటువంటి సందర్భాలు కలిసిరావు. తెలు సునా?

విద్యా—(తనలో) వాస్తవమే మూర్ఖుడైనవాడు మతేమనును. (చండిక ప్రవేశించును. స్త్రీలందరునుకూడి మహారాజునకు హారతి యొసగుదురు)

పౌరా—సరి; చండికమ్మా! ఇక మహారాజుగారిని విశ్రమింపనివ్వండి.

(చండిక మహారాజుగారి చేయిపట్టుని శయనమందిరమునకు తోడ్కొనిపోవును. అందరు నిష్క్రమింతురు.)

కామాక్షమ్మ—చండికమ్మా యింక నేను పోయివస్తాను.

చండిక—అబ్బా యదేమిటమ్మా యింతతొందర! మహారాజుగారికి సేవచేయుటకు నిచ్చటనుండవా?

కామాక్షమ్మ—వలదమ్మా అదుగో సోమడు నాకొఱకు లాంతరు పట్టుకుని నిలబడియున్నాడు.

చండిక—ఇంకేమి చెప్పను! ఒక్కనిముసమాగుము, మహారాజుగారి పానుపైనా కానిమ్మా. మీనాక్షి యెంతో చక్కగా పాడుతుంది వింద్దువుగాని ఆగవమ్మా.

కామాక్షమ్మ—ఉండనమ్మా! పోయివస్తాను.

(అని యిరువురు నిష్క్రమింతురు)

---

# ద్వితీయాంకము



## ప్రథమరంగము

(స్థలము కుంజపురములో సుబ్రహ్మణ్యగుప్తగారి మేడ. మీనాక్షి యను వేశ్య పాడుచుండ గుప్తగారున్ను ఆనందభువనసమాజము వారును వినుచున్నారు)

మొదటిగృహస్థు—(పాటపూర్తికాగానే) ఏమి ? ఎల్లావున్నది ?

రెండవ—మీనాక్షీ ! నిజంగా మహాబాగాపాడినావుసుమా ! శెబాస్

మీనాక్షి—ఇవ్వేళ శారీరము కాస్త—

మూడవ—అవును తెలుస్తూనేయున్నది. పాడేవాళ్ల శారీరమెప్పటికి కాస్తయిదిగానేఉంటుందిలే

(సభవారినిచూచి)

మనది గొంతుక పాడేవారిది శారీరము విన్నారా !

రెండవ—దానికేమిగాని అభ్యంతరము లేకుండా మంచివన్నెగల బంగారమే. పుటములోనుంచి తీసినతీగ యెల్లామెరుస్తుందో చూశారా ! మీనాక్షీ కానియ్యి కానియ్యి యిపుడు బాగా రక్తి కడుతూంది.

మీనాక్షి—రాత్రి చాలా పొద్దుపోయినది. నేనుమఠానికి మహారాజు గారిని సేవించుకొనేందుకు వెళ్లవలసియున్నది. ఇంకనాకు సెలవు దయచేయించితే సంతోషిస్తాను.

రెండవ—ఈమఠమేమిటి ! శేవయేమిటి. (అందరునొకరి నొకరు చూచుకొని ఆశ్చర్యము నటింతురు)

భాషా

(విద్యాధరుడు ప్రవేశించును)

మూడవ—దయచేయ్యండి. విద్యాధరుడుగారు! ఎప్పుడునూ మీసంగతింతే. పూజ ముగిసినపిమ్మట పురోహితుడు వచ్చినట్లు. ఇవ్వేళ యెంతసొగసుగా ఉండెననుకున్నారు.

విద్యా—అయ్యా! మీరందరు సొగసులు గిగసులు తెలిసినవారు. షోకుగలవారు. నాకాపాటా గీటా—

మూడవ—ఇదిమాత్రము కాస్త విచిత్రముగానే వుంది. భర్తృహరి చెప్పియుండలేదాండి 'సుభాషితేన గీతేనా' అని.

విద్యా—మీరు నన్నేమనుకున్నా సరే కాని నాకిటువంటివాటితో అవసరము బొత్తిగా లేదన్నమాట నిజము.

మొదటి—మాకైనా యెందుకండీ! యివన్నీ? మేమెప్పుడును యిట్టి ప్రసంగములలోపడము. కాని మన సుబ్రహ్మణ్యగుప్తగారికి సర్కారువారు రావుసాహేబు పదవినిచ్చారు ఆసందర్భములో సంగీత కచేరీ పెట్టించాము. రమ్మని పిలిచారు. తీరావచ్చి చూచేసరికి యీతటంగము.

గుప్త—చాలా వెదకినానండి. పాటకుడు దొరకనేలేదు. చివరకు సాని గారినే పిలుచుకునివచ్చినాను. కాని పాటఅనగా ఇదేసుమండి.

మొదటి—విద్యాధరులుగారు! కూర్చోనైనా కూర్చోరేమి, ఇవ్వేళ మీరింత వైరాగ్యము తాల్చడమెందుకు?

మూడవ—వైరాగ్యము తాల్చడానికి కారణాలెన్నో వున్నాయి ఈజగత్తస్థిరము జీవితములు బుద్బుదప్రాయములు. ప్రాణిమాత్రులను జరామరణములు వెంబడించియే యుండును. ఈవిచారములతోనే వారికి వైరాగ్యము కలిగియుండవచ్చును.

మొదటి—మెట్టుకేదో కారణమున్నమాట నిజము. సరే, మీనాక్షి ఇఘుచివరకి యేదైనా దేముడిమీద పాటకాని

మీనాక్షి—(పాటపాడును)

(తాంబూలములు పన్నీరు అందరికి నొసంగుదురు. మీనాక్షి సభకు సమస్కరించి నిష్క్రమించును.)

మొదటి—ఏమండీ! విద్యాధరుడుగారూ! ఇవ్వేళ మీరింత విచిత్రముగా మారినందుకు విశేషకారణ మేమైనకలదా?

విద్యా—ఏమండి! ఇది యిప్పుడు వెడతానన్నది ఎక్కడికి?

మూడవ—బలే! అడిగిన ప్రశ్నయొకటి చెప్పినజవాబు మరియొకటి.

మొదటి—ఇహ పరిహాసాలు కట్టిపెట్టు. అది మఠానికి వెడతానన్నది. అయితే?

విద్యా—ఈమఠముసంగతి యేమయినా మీకు తెలిసినదా?

మూడవ—సంగతేముంది? తెలుసుకునేందుకు. నలుగురు ముసలమ్మలు ముతకమ్మలు కూడి శుష్కవేదాంతాలు చెప్పుకునే కూటము. లేకవాళ్ళకు పాట వినమనస్సైందేమో! వాళ్లలోనూ కాస్త షోకైన ముసలమ్మలుకూడా ఉండవచ్చునుగదా!

విద్యా—ఇదిగో వేళాకోళాలతో యిట్లాపోనియ్యకండి. మఠమా! మఠమేమిటి. అది బందిపోటువాళ్ల కూటము.

మూడవ—ఏమిటి, అట్లా అంటున్నా రేమిటి?

మొదటి—మీరు చెప్పేది గాలివార్త

విద్యా—నేను వీరూ వారూ చెప్పేకబుర్లు నమ్మేవాడనుగానండోయి

మూడవ—అయితే పూర్తిగా కళ్లతో కళ్లతో చూసిన సత్యమేనా? ఇంతకూ మీరామఠములో కనిపెట్టినదల్లా యేమిటి?

విద్యా—అర్థంతా దానంతటఅదే తెలుస్తుంది. కాని మీరు మాత్రము యీహాంశములో అశ్రద్ధచూపితే మనసమాజము దగ్ధమైపోతుంది సుమండీ !

మొదటి—మీకివ్వేళ యింత సంతాపముగా నున్నదే ! మనలో నారెవరైనా వాళ్లవలలో పడ్డారా యేమిటి ?

(విద్యాధరుడు మొదట గృహస్థుచెవిలో నేమోచెప్పును. అందఱు గుసగుసలాడుకొని యాశ్చర్యమునటింతురు)

మూడవ—(గట్టిగా) బసవరాజా ?

అందఱు—చిక్కుపడేవాడే సందేహమేమిటి ?

విద్యా—అందుకుచేత మీతో చెప్పేదేమంటే

గీ॥ మేకవన్నెపులులు లోకాన దాంభికుల్
వారుపన్నుమాయవలల దగిలి
చెడు నమాయకుండు ; శీఘ్రంబెయవ్వారి
నణచివేయవలయు నధికమతులు.

కనుక నడుములు బిగించండి

మూడవ—ఇంక బిగించండి అని చెప్పవలసిన అవసరమే లేదు.

రెండవ— ఆమఠములో జరిగే మోసమును గురించి కొంచెము యేమయినా చెప్పండి.

విద్యా—చెపుతాను చెపుతాను లెండి. ప్రస్తుతము నేను మహారాజు గారి వలన దీక్షపొందిన వారి ముఖ్యశిష్యుడను. మీయొప్పటి విద్యాధరుడనుకాను.

రెండవ—కాస్త ఆగండి. ఆవచ్చేదెవరో చూడండి.

మూడవ—(చూచి) ఆఁ ఇప్పుడు దయచేస్తున్నారు పాటాగీటా అంతా అయిపోయిన తర్వాత. ముసలాడి చెవిపోగు రవ్వ వెన్నెల్లో యెల్లా మెరుస్తో ఉన్నదో చూడండి.

రెండవ—ఒకచెవిపోగేనా ? అతడిమైఖరి అంతా చూడతగినదే. అయ్యో వృద్ధాప్యములో చేసుకున్న పెళ్లికాదండీ ? మరి ఎంతయినాను.

విద్యా—బసవరాజుగారు దంపతీయుక్తముగా మహారాజుగారి దీక్షను గ్రహించారు. రామయ్యగారు వారిశిష్యబృందానికి చేరినవారే గదా ! ఇంక ప్రస్తుతము నేను మహారాజుగారి యందు చాలా భక్తివిశ్వాసములు గల ముఖ్యశిష్యుడనేకదా. జాగ్రత్తనుమండీ మాటలసందర్భములో పొరపడేరు.

మూడవ—ఏమితమాషాచేస్తానో చూడండి. (బసవరాజు, రామయ్య సోమడు ప్రవేశము)

మొదటి—ఓహో ! బసవరాజుగారా ! దయచెయ్యండి. మహాబాగా ఉన్నదే మీసంగతి. పాటకచేరీమాట బొత్తిగా మఱచిపోయినట్టున్నారు.

బసవరాజు—మరవలేదు. మఠానికివెళ్లి ఉంటిని. అక్కడ మహారాజుగారి ప్రవచనము ముగిసేవరకు ప్రొద్దుపోయినది.

రెండవ—ఎక్కడకీ వెళ్లామన్నారూ !

బసవ—కృష్ణాలయమునకు సమీపముగానే మహారాజుగారి మఠమున్నదే అక్కడికి, అనగా ఇదివర కెంతమాత్రము ఆసంగతి మీకు తెలియదనేనా ? బాగాఉంది ! కుంభకర్ణుడి తంతుగాఉంది. విద్యాధరుడు కూడా— —

విద్యా—అవునవును. నేను అనుగ్రహముపొంది అప్పుడే ఎన్నాళ్లో అయింది. మహానుభావులు చాలా యోగ్యులు.

నాలుగు—అయితే ! బసవరాజుగారూ ! తమరు మహారాజుగారి యొద్ద ఉపదేశము పుచ్చుకునే యుండవచ్చును గదా !

బసవ—ఆమహారాజుగారనుగ్రహించిన మాట నిజమే. అన్నివిధాలా ఆ పౌరాణికులవారు చేసినయుపకారము.

మూడవ—ఆపౌరాణికులవారెవరు ?

విద్యా—మహారాజుగారి పట్టశిష్యులు మహారాజుగారికిచాలా ఆప్తులు.

మూడవ—బసవరాజుగారూ! ఇదంతా బాగానే ఉన్నదికానీ—

బసవరాజు—కానీ యేమిటండీ ? ఎవరైనాసరే అహంభావమును త్యజించి మహారాజుగారిని ఆశ్రయిస్తే వారు తరించినట్టే. కానీగీనీతో పనిలేదు.

మూడవ—అదంతాసరేనండీ. ఉపదేశము మీరొక్కరే పుచ్చుకున్నారా ? దంపతీయుక్తముగా పుచ్చుకున్నారా ?

బసవ—ఏదిచెయ్యడానికి చెందడానికి మనమెవరమండీ ? యావత్తు చేయించగలవారు చేయగలవారు మహారాజుగారు.

మూడవ—మహారాజుగారున్ను పౌరాణికుడున్నూ; ఇంకా—

బసవ—అదీ పుణ్యాత్మురాలే దానికీ సేవఘటించినది.

రామయ్య—వాస్తవముగానే పుణ్యాత్మురాలు కాని సత్పురుషుల సేవ దౌర్భాగ్యులకు దొరుకుతుందా ?

విద్యా—వీరివంటివారి పాలిట ఒడినది కనుకనే పాపము ఆమెకీగతి

మూడవ—అయితే రామయ్యగారు ! ఈసేవాసత్రములో మీరూవొక పెద్దపుణ్యపుమూటకట్టుకున్నారాలేదా ?

రామయ్య—(కోపముతో) ఎమిటీ వేళాకోళము ? కౌటిల్యము?

మూడవ—వేళాకోళమే శ్రీరామరామా! ఇట్లా ఎగతాళిచేసి పాపము వొడికట్టుకునేవారెవరు ? అయితే బసవరాజుగారూ ! తమ యిల్లాలిని పావనము చేయించుకున్నారన్నమాటే ?

బసవ—అయితే ఎంతప్రయాసపడవలసి వచ్చిందండీ! స్త్రీలు అసలే మూర్ఖులు. నేనెంతచెప్పినా దానికినచ్చలేదు. కాని చివరకు పాపమాచండికమ్మ అంతాసమకూర్చినది. చండికమ్మ మహారాజుగారివద్ద ఉన్నవారల్లో నొకరత్న మేసుమండీ.

రెండవ—సరి, సరి; అయితే మహారాజుగారు యిటువంటి రత్నాలు అనేకంగా తమవద్దచేర్చినట్లుంది.

మొదటి—మరి యిటువంటివారి సర్వస్వముపోయి వారివద్ద ద్రవ్యము కూడా బాగానేపోగుపడియుండవచ్చును.

బసవ—అష్టసిద్ధులూ వారికిస్వాధీనమై యుండగా వారికి ద్రవ్యమనగా యెంత. అయితే మహారాజుగారి పాదములకు అర్పణచేసిందంతా సద్వ్యయమని పౌరాణికులు చెప్పితే మేము సంతోషంగానే ... ... ...

మొదట—పోయిందీద్రవ్యము. పోనివ్వండి. కాని బసవరాజుగారూ! ఈసందర్భాల పరిణామమేమయినా కనిపెట్టినారా?

బసవ—పరిణామమా? పరిణామమేనా? మాసంసారయాత్ర చక్కగా నెరవేరి చివరకు మాకుభయులకు మోక్షము లభించును. ఇదే పరిణామము.

మొదటి—ఛ, ఛ! బసవరాజుగారు చాలా అవిచారముచేస్తున్నారు.

బసవ—ఇంతమర్మమెందుకు? అనదలచినది స్పష్టముగానే అనరాదూ?

మొదటి—మంచిది స్పష్టముగానే చెప్పుతాను అయితే అయ్యా! మీమహారాజుగాడు, వాడా పౌరాణికుడు మరి అది యెవతె! ఆచాముండ! వీరందరుకలసి యొకపెద్దరాక్షసి యెత్తు యెత్తియున్నారు. మరి మీవంటి యమాయకుల నందరిని కొల్లగొట్టుచున్నారు.

రామయ్య—శివ! శివ! శివా! ఏమీా యీాపోగరు. అట్లా అవకతవక మాటలుకూసి సత్పురుషులను నిందించి ఎందుకయ్యా! ఆజిహ్వాను పాడుచేసుకుంటారు? ఈపాపానికి ప్రాయిశ్చిత్తముయెక్కడ అనుభవిస్తారు? అయ్యా విద్యాధరుడుగారూ! మీారైనా వీళ్లకు రెండుమాటలు చెప్పి వీళ్ల కళ్లు తెరవండి. శుద్ధగుడ్డిముండావాళ్లు.

విద్యా—అంతా బాగా తెలివిగలిగే మాటలాడుచున్నారు. మేలుకొన్నవారిని మేలుకొలపడమేమిటి

మూడవ—రామయ్యగారూ! మీాకెందుకండీ? యీాలేనిపోని తగులాటములు.

మొదటి—బసవరాజుగారు! ఇదివట్టి డబ్బుప్రమేయమేకాదు సుమండీ! ముఖ్యముగా పేరుకాపాడుకోవాలి. మీారీచేసుకొన్నది నాలుగవ వివాహము. ఇదివర కాదాంభికలుకాచేసినది పోనివ్వండి. దొంగలు దోచుకుపోయినారనుకోండి. ఇఖముందుమాత్రము వాళ్లపేరు తలవకండి. అయిందా విప్పిచెప్పానా?

బసవ—ఇదేనా విప్పిచెప్పడము. ఏమిటో వాగినారు అంతే. ఎవరిభావనయెట్లాఉంటే వారికి జగత్తు అట్లాకనిపిస్తుంది. ధర్మరాజుకి అందరు సజ్జనులుగానే కనపడేవారు. దుర్యోధనుడికి అంతా దుర్జనులే. కాస్త వెనుకాముందు ఆలోచించి మాటలాడవలెనండీ.

రెండవ—అయితే బసవరాజుగారు! మీారింత ఆగ్రహపడడ మెందుకండీ! "బాలాదపిసుభాషితం" గ్రాహ్యంఅన్నారు. మేముచెప్పే మాటల్లో గ్రహించతగినవి మీారు గ్రహించవలసినదే.

బసవ—ఇందులో ఏమిటి గ్రహించేది. మీాబొంద మహారాజుగారు ద్రవ్యమపహరించారట మహాబాగావుంది.

మూడవ—"మేము మాసర్వస్వము మహారాజుగారికి అర్పించివేశాము. అయిందా అయితే ఇందులో తప్పేమిటి." మీతాత్పర్య మిదేనా బసవరాజుగారు !

బసవ—ఇంకేమిటి నేను చేసుకున్నది నాలగవ వివాహమట. పేరు కాపాడుకోవలెనట. అబ్బా ! యీతుంటరులకు నా పేరు నిలప వలెనని చింతయా! నేను నాపరువును వీధిలో పడవేసుకున్నా కాబోలు. భార్యమూలకంగా పరువు యెవరికిపోతుంది. ఎవడిపాలిట నటువంటి దుష్టురాలుపడ్డదో యెవడైతే చేతులకు గాజులు తొడిగించుకున్నాడో వాడిది. మాదాని నడవడి యెటువంటిది. మంచి మంచివాళ్లు దాని కాళ్లు కడిగి తాగవచ్చు.

మొదటి—ఉండవచ్చును. కాని ఆపె అమాయకురాలు. మీరు తెలివి హీనులు. అందువల్ల ఆమెకు యెప్పుడు ఏ కీడు సంభవించునో యెవరు చెప్పగలరు.

(యజమానునకు అగౌరవము జరుగుతున్నదని సోముడు కండ్లెఱ్ఱ జేసుకొనును)

బసవ—సంభవింపనీ, మాది మేము చూసుకుంటాము. అందులో మీ మొగములకు నలుపేమియు అంటబోదుగదా !

రామయ్య—ప్రారంభములోనే యీ మాట అని ఉంటే చచ్చినట్లు నోరుమూసుకొని కూర్చునేవారు. ఈ నాస్తికులతో మంచిమాట ఆడితే యేమిప్రయోజనము.

బసవ—అయిందా యింతటితో ?

మొదటి—అయింది అంతాసంపూర్ణము. మేము అన్నమాటలకు బాగానే పెడర్థాలు తీసినారు.

బసవ—పెద్దవాళ్లనండి ఏమయినా అనండి. ఏది యెట్లాఉన్నా యొక రికి లాభముగాని హానిగాని సంభవించే సమయమువచ్చినప్పుడు కానీ పోనీవాళ్లు, అది మాన్పగలరా?

మొదటి—బలే యేమిసారము గ్రహించారండీ. ఇంకమీాద చెప్పే దేమీాలేదు. తెలిసిందా?

విద్యా—ఏమిటండీ బసవరాజుగారు! సహాకారణంగా పిల్లలతో వితండ వాదము పెట్టుకొని కూర్చున్నారు. అయ్యా యీా సంగతులు పిల్లకు రుచిస్తాయీా? పిల్లవల్ల అపిభంగము కావటమేకాని.

రామయ్య—వాస్తవము అంతే. పిల్లతో ప్రసంగించడం వల్ల లాభము యేమిటి. పదండి, నిరర్థకంగా యీా వేళ నిద్దుర చెరుపుకోడమయి నది. ఇదిగో నేను మతానికి వెళ్లుచున్నాను. (నిష్క్రమించును)

బసవ—నేనుమాత్రము యిక్కడ కూర్చోడమెందుకు ఇంక,

మూడవ—వోకి చుట్టకాల్చండి (అని యివ్వబోవును)

బసవ—నాకు మీా చుట్టగిట్టా యేమీావద్దు. (కోపముతో నిష్క్రమిం చును)

మొదటి—ముసలివాడు బాగానే పిచ్చిలో పడ్డాడు.

విద్యా—అమాయికుడు. వట్టి అమాయికుడు. పాపము వీడి బేలతన మువల్ల రాకూడని ప్రసంగము రాకపోతేచాలు.

మొదటి—ఇంకముందు చేయవలసినదేమిటి?

విద్యా—అది యీా రోజుననే నిశ్చయించుకొనుటకు వీలులేదు. నేను మతములో ప్రవేశించాను గదా! రోజూవచ్చి మీా అందరినీ కలు సుకుంటూంటాను ముందుచర్య లెట్లాఉంటాయో వాటినిబట్టి తిరిగి యొకనాడు కూర్చుని ఆలోచించుదాము. అవునుగాని యొకమాట

చెప్పడము మరచినాను. ఇవ్వేళ ఇక్కడకు వచ్చిన ఆవిడకూడా మహారాజుకి శిష్యురాలే. స్వహస్తపరహస్తాలద్వారా దీనిని స్వాధీనము చేసుకునివుంచితే 'కోకాలః ఫలదాయకః' యెవరుచెప్పగలరు. మెట్టుకు యేమయినా ప్రయోజనముంటుంది. ప్రస్తుతములో మహారాజుని భజియిస్తూవున్నది గాన మీకు సూచనగా చెప్పి ఉంచాను.

మొదటి—ఈ పట్నములో దీని ప్రాణస్నేహితు డెవడైనా ఉండనే ఉంటాడు. వాడిని స్వాధీనపఱచుకొని చూడాలి. ఏమికాగలదో. ఇప్పట్లో మనకీ క్రొత్తచిక్కొకటిసంభవించిన దన్నమాటే. అయితే అది పూనుకోవలసిందే. లేనియెడల—

మూడవ—లేనియెడల యీదాంభికులు మీఱిపోతే మనముకూడా సన్యాసముపుచ్చుకునేసమయము తటస్థించునేమో? విధ్యాధరా! జాగ్రత్తసుమా! వేషమని ఆడబోయి యేవలలోనో చిక్కుకునేరు!

విద్యా—ఏమి కానున్నదో చూద్దాముకాదూ! పదండి పొద్దుపోయింది.

(విద్యాధరుడుతక్క అందరు నిష్క్రమింతురు)

విద్యాధరుడు—(తనలో) దాంభికులహృదయములు విషపూరితములు మాటలుమాత్రమమృత తుల్యములు. అట్టివారి యుపన్యాస విషమును కడుపారగ్రోలి శాంతికోలుపోయి గృహస్థులు విపత్సముద్రమున మునిగి సంసారసుఖమును పోగొట్టుకొను చున్నారు. పాపము! బసవరాజుగా రట్టిగృహస్థులలో నొకడు. వీరియాటలెంత వరకుసాగునో చూచెదగాక. (నిష్క్రమించును)

## ద్వితీయరంగము

---

(కుంజరపురమున రాజమార్గము. సోమడు, బాబిగాడు ప్రవేశింతురు)

బాబి—దానితస్సాగొయ్యా చండికమ్మ యేసమేయేసము. ఎవరూ సూడకుంటే అంతే. మటంలోకి క్కొత్తోల్లొస్తేనేం, ఇగ సూడాలి మజా దాని గంతులూ, పరుగులూ, క్యాకలూ.

సోమ—పురాణం చెప్తాడే అతడు మాత్రం శానామంచోడు.

బాబి—ఉండొచ్చులే కాత్త. కాని శండికమ్మ యేపాటపాడితే అదే పాట అతడూ పాడుతాడు.

సోమ—మరి బాబయ్యా! నీకు గ్యానం దొరికి వైకుంఠ కనబడితేనో!

బాబి—ఆ! కనపడతది మనోంటి పేదోళ్లకి. ఐకుంఠం గొప్పోల్ల కందర్కీ మాత్రం మహారాజు సూప్తాడంట ఒకపాలి గ్యానం గ్యానం అంటారే అది సూద్దామని మారాజు నిండా ముసుగేసుకుని కూసుంటే కాత్తిట్టా తొంగిసూశాను. సూశేసర్కి ఆపురానం బ్యామ్మడున్నాడే కస్సుని కుక్కలాగ నామీద పడ్డాడు.

సోమ—బాబో మరయితే నా పనే బాగుంది. మా అయ్యోరు అమ్మోరు దేవుడంటోళ్లు. వంకరమాటే లేదు. బోశేశావా లేదా తిన్నవా లేదా అని రోజూ, అడుగుతారు పాపం.

బాపి—మటంలోమాట అల్లాలేదు. బ్యామ్మలందరూ రోజూ నెయ్యా అన్నం పిండొంటకాలు కావల్సిందంతా లగాయిస్తారు. మాకు సద్దెప్పుడైనా దొర్కుతది. చూడు నా బొయికలన్నీ యెల్లా బయటడ్డాయో?

సోమ—అవునురా! ఔను.

బాబి—నువ్వు సూడరామని ఓ రాజులాగున్నావు. అంతా తిండిలో ఉంది చూడు. నీ భోజనం మాట కుదిరిందిగదా! యింక; నూశావా ఎక్కడన్నా వొక ఆడదాన్ని జూచుకుని యివాహం చేసుకో నీరంగు నీ సొగసు సోకుసూసి యెందరాడోళ్లైనా యివాహం సేస్కో సేస్కో అని నీయెంటబడతారు. నిజం సెప్పు అవునా-లేదా?

సోమ—ఉండొచ్చు; గాని భార్యకూడా మనసువచ్చింది దొరకాలి లేకుంటే ఓదెయ్యం మెడలోబడితే అయిపోతుంది పని. ఇదిగో సూడు నా భార్య వంటిమీద యేసేందుకు మా అయ్యోరే నగలిచ్చారు. దేని అదృష్టాన్ని ఉంటే దానికి దొరుకుతాయి.

బాబి—మరి యింకేమి కావాలి. నీవు గట్టోడవి. నీ వొద్ద యిన్ని నగలూ యిన్నిబట్టలు ఉన్నయి. ఇంక భార్యల కేమికరువు.

సోమ—అది నిజమేకాని సూడు ఓ.........కాదు నాలుగారాలై యుండాలి. అది.........(చెవులో చెప్పును)

బాబి—రోజూ యిక్కడనుంచి రెండుమూడుసార్లు.........

సోమ—హద్దిగో అదే! బొత్తిగా పోట్లగొడ్డులాగ హుం అని మెడ వంకరేస్కోని కోపంగా సూస్తూ వోతంది. ఒకపాలిగాదు రెండు పాల్లుగాదు పదిసార్లకూ అంతే ఇగ

బాబి—ఆఁ; ఇదిమాత్రం నువ్వు గెహించలేదు. అయ్యా సోమయ్యగారండోయి అందరాడోళ్లది యిద్దేమోసం, ఓళ్లమీదనయినా మనసుంటే లేనట్టు సూస్తారు. ఓల్లమీద మనసులేకుంటే ఉన్నట్టు సూస్తారు. కిందిది మీదా మీదిది కిందా. ఒకచారి రెండుచార్లు పదిచార్లంటూ ఉండాలిగాని యెక్కువైస్తాదు యెబై సార్లకూడా సూస్తారు. అయితే వొక కంథుండ్రొందుట్లో నన్నిచార్లె ... స్తే అంత ప్యామయెక్కువనుకో.



సోము— అదా కథ

బాబి—కథంటె కథే

సోము—అయితే ఇంతలో దానియెజమానురాలియెంట ఘటములోకె ల్తుంది. మళ్లెల్లేటప్పుడు కలిపిసూపుతాను చూడు నాచెయ్యి

బాబి —మరిప్పుడెళ్లడం యెక్కడికి

సోము—ఈమూటట్టుకెల్లి పురాణం సామికి అప్పగిస్తాను. మల్లేకపోతే ఎవడైనా దొంగిలికెడితే కష్టంగాదూ!

బాబి—(సంశయముతో) పురాణం సామికప్పగిత్తావా? సరే అప్పగిచ్చు.

(సోమడు నిష్క్రమించును)

బాబి—బాగా దొరికింది బ్యేరం (లోపల యెవరోపిలిచినట్లు నటించి.) వచ్చె వచ్చే; తస్సాగొయ్యా బ్యామ్మలు కాతమూటన్నా ఆడనీరు. (నిష్క్రమించును.)

---

## తృతీయరంగము.

---

(మఠములో నొకగది. భోజనమునకు పీటలు కంచములు సమర్చబడియుండును. పౌరాణికుడు; చండిక ప్రవేశము)

పౌరా—ఆడువారినోటనూగింజనానదు. వారికేమాటగాని చెప్పడమనగా నది నడివీధిని పెట్టడమే

చండిక—నేనేమి, అందఱాడవాళ్లవలె ఊళ్లోమాటలు వాయనము పంచుతూ తిరుగుతానా?

పౌరా—అదిగాదే. నీవటువంటి దానవుకాదు. మనసునకు తోచిన మాట నీతో ఊరికే చెప్పినాను. అదిపోనీగాని చూడు, దానియెదుట నటిస్తాను దానికి వేరేకారణమున్నది. ఇది వ్యవహారము.

చండిక—(అనుమానముతో) అట్లనా ?

పౌరా—వాస్తవముగా యిది వ్యవహారమే. తెలిసిందా? (ఏడుపు కంఠముతో) ఇంకనన్ను తిప్పలుపెట్టకేమి.

చండిక—అమ్మో? శాస్త్రుల్లుగారూ! ఈఆడంగుల గయ్యాళితనము మీరెప్పుడు నేర్చుకున్నారు? చెప్పండిమరి ఆవ్యవహార మేమిటో ఆహేతువేమిటో, మరేమీలేదు. నన్ను వీధిలోనికి యీడ్చే హేతువే.

పౌరా—ఛీ; ఛీ; ఉన్న హేతువల్లా యింతే. నీవూ నేనూ జన్మానికల్లా గట్టి ముడివేసుకున్నాముగదా! నీవులేనిదే నాకు నేనులేనిదే నీకు సద్గతి లేనేలేదుగదా! మనమీరోజున నిచ్చట చాలా సుఖముగా ఉన్నామని పైకి అనిపిస్తుందిగాని యిది శాశ్వతముకాదు. ఇదియుగాక యిచ్చట మనస్థితి యెప్పుడును ఒడిలో నిప్పుకట్టుకున్నట్టే... కనుక.

చండిక—అయితే ఆఅమ్మ వస్తే నిప్పు దులిపేస్తుందా?

పౌరా—నేను జెప్పేదంతా వింటావా లేదా? ముందు వెనుక మంచి చెడ్డ లేమయినా అయితే యిక్కడనుంచి తోకత్రూడించవలసినదే కదా! మరి అప్పుడు దగ్గర డబ్బేమయినా ఉండవలెనుగద. మరి అది యిటువంటి మోసములు చెయ్యకపోతే యెట్లా దొరుకుతుంది.

చండిక—బలే శాస్త్రుల్లుగారూ! బూటకపుమాటలు బాగానే నేర్చియున్నారే? ఆడబ్బుతోపాటు పెనుభూత మొకటి మెడకు తగులుకుంటేనో? అది నాకూటిలో మన్నుకలిపితే నాగతి యేమిగాను.

పౌరా—నీమనస్సున భయ మెంతమాత్ర ముంచుకొనవలదు. తేనెపట్టులోని తేనె పీల్చి పట్టిమడ్డి పారవేసినట్లు ద్రవ్యము నపహరించి దానిని వదలెదను. బోధపడ్డదా ?

చండిక—ఇదంతా బాగా తీర్చినట్లు చెప్పినారుగాని దానిదగ్గరనుంచి మీకు డబ్బెట్లా సాధ్యమవుతుంది ?

పౌరా—ఇదిగో ఇదే నీవు నన్ను ఓంప్రథమములో అడగవలసినది (చెవిలో చెప్పును) కామాక్షి నొకమాటు మనస్వాధీనములోనికి దెచ్చితివా దాని నగలన్నీ మనవే ననుకో. నే నన్నట్లే అయితే దానిని బానిస చేసుకొని దానిచేత నీచీర లుతికిస్తానో లేదో చూడు.

చండిక—ఆఁ అది నాచీర లుతికినప్పటికి రోకలికి చిగురుపుట్టుతుంది.

పౌరా—నేను చెప్పినట్లు చేస్తివంటే అంతా సానుకూలమవుతుంది. ఈ కామాక్షియే ఆముసలివా డెంత తలబద్దలుకొట్టుకున్నా మహా రాజుగారి గాలి సోకనిచ్చిందికాదు. దానిని నీవు దోవలోనికి తెచ్చి నావు. అందుచేత నీమాటలలో నేదో ఇంద్రజాల మున్నదంటాను. అబద్ధమా? సమాధానమయిందా? కోపము పోయిందా?

చండిక—ఇదంతా బాగా ఆలోచించి తరువాత ఔనో లేదో చెబు తాను.

పౌరా—(ముందుకు జూచి) చూడవే! వాడు వచ్చినాడు. మహారాజు త్వరగా వడ్డనకానీ. (మహారాజు ప్రవేశించును.)

పౌరా—రండి! మహారాజుగారు! ఏమిరోయి! బాగానే అడ్డము బలిసి నావు. ఈవూరికి వచ్చినప్పుడు సన్నంగా యెండి వరుగై బీరకాయ వలె నుంటివిగాని ఇప్పుడు బాగా పెద్దకావిడి గుమ్మిడిపండువలె గుండ్రముగా నున్నగా నిగనిగలాడుతున్నావే!

మహా—అయ్యా ఇది కొవ్వు. ఊరికే కూర్చుని పిండివంటలు తింటూం డడము మంచిదా?

పౌరా—కొవ్వుఅను ఏమయినా అను గాని మహారాజుగారెప్పుడూ ఏమీ పుచ్చుకోరని మేము వదంతివేశాము. అది లోకులకు నిజ

మని యెట్లాతోస్తుందో! సమర్త పెళ్లికూతురికి తెచ్చినట్లు నీకు తెచ్చి యిచ్చే ఫలహారాలన్నీ యెవరు తింటున్నారనుకొంటారో యీ తెలివిహీనులు. వాస్తవంగా యీ తెలివిహీనులే లేకపోతే జగత్తులో దాంభికులగతి యేమగునో?

మహారాజు—ఏమగునో అనగా? ఒకరినొకరు కొట్టుకొనిచత్తురు. ఎందుచేతననగా

గీ. మ్రింగు నాకట మీలను మీలు జలధి,
రాజు రాజును వధియించు రాజ్యకాంక్ష,
మృగయుఁడు వధించు వనమున మృగము వేడ్క-
స్వార్థపరతాప్రపూర్ణ మీజగతియెల్ల.

మీరు నన్ను నేను మిమ్ము మింగేసమయము వచ్చును.

పౌరా—కాని యిప్పటివరకు చక్కగా జరుగుచున్నది. ఇదే విధముగా ముందుకూడా నెట్టుకుపోతే చాలు.

మహా—ఏమి! ముందుకూడా నెట్టుకుని, ఎందుకు పోదు? ప్రపంచములో బుద్ధియేమయినా హెచ్చుచున్న దనుకుంటున్నారా?

పౌరా—అన్యత్రా కాస్త అట్లా అగుచున్నట్లున్నది. కాని మనవ్యాపారమున కందువల్ల నేడే భయమున్నదనిమాత్రము నేను నమ్మను. ఎన్నో యుగములు గడచిన తరువాత కాబోయే మహాప్రళయానికి నేడే భయపడడ మెందుకు? నీభక్తమండలిలో యెటువంటి యెటువంటి వారు చేరుతున్నారో నీవు చూచుచునే యున్నావుగదా!

మహా—వంటపుట్టినమూర్ఖత్వము చదువుకుంటే పోతుందా. విద్వాంసులేమి, విద్యాహీనులేమి, మూర్ఖులు మూర్ఖులే. పనికిరానిచోట్ల శోధించేవారు కొందరుంటారు గాని మనయింద్రజాలమును వారు గెలువలేరు.

పౌరా—ఓరేయ్ విన్నావా అందరూ సమానవ్యక్తులయితే వ్యవసాయముతో పనే లేకపోవును. కొందరు ఆ౽కతీరు కొందఱు మరొకతీరు. ఇట్లు జరుగవలసినదే.

మహా—ఇక కొంద రెటువంటివారుంటారంటే చెప్పడానికి వీలే లేదు. ఒకడు డబ్బులేక యింత కలకండతునుకో లేక యేదో నాముందు పెట్టవలసి యుంటే మొగమెట్లాగో చేసుకుంటాడు. అప్పుడు నాకు నవ్వెక్కడ వస్తుందో అని భయంగా ఉంటుంది.

పౌరా—అన్నట్లు బాగా జ్ఞాపకము వచ్చింది. ఏమిరోయ్ సమాధిలో కూర్చున్నప్పుడు నడుమ నడుమ మెల్లగా కళ్లు విప్పి ముందేవరేమి పెట్టినారో చూస్తూ ఉంటావు. అది మంచిదికాదు సుమా! ఎవరైనా కనిపెడితే కంఠానికి రొస్తుందిసుమా. నీవెందుకురా అది చూడడము? నేనున్నానుగా.

మహా—నయివేద్యము ముందుకు వచ్చినప్పుడు మాత్రము నా దేమీ సాగదు. ఏమేమి తెచ్చినారో అది చూడ మనసుపుట్టక మానదు. నేనేమి చెప్పను. నైజము.

పౌరా—ఓరేయ్! నీవు నుఱేమయినా చెయ్యిగాని సమాధి మాత్రము బాగా రక్తి కట్టిస్తూండవలెను సుమా. కళ్లు గట్టిగా మూసే వుంచాలి.

మహా—శాస్తుల్లుగారూ!

గీ. నాసమాధికి జనులు సంతసము పడుదు
రందు నాపడుబాధ శ్రీహరి యెఱుంగు;
ధరణిమోసెడు శేషాహిఁ బ్రస్తుతింతుఁ
గాని మానవు డెఱుఁగునే వానిబాధ.

ఈతొడలు బిగిసిపోతాయి. మెడ నరంపట్లు వదలిపోతుంది. మీకిల్లా అయితేనా ?

పౌరా——(తనలో). ఎట్లా యిరికించిపెట్టానో బానిస నాకొడుకుని ? (ప్రకాశముగా) ఒరేయి! జూడబోతే యివన్నీ చిన్నచిన్న సంగతులే గాని వీటినే చాలా జాగ్రత్తగా జూసుకుంటూ ఉండవలెను. మరొక సంగతేమిటంటే; మాకు పిల్లలు పుట్టవలెను మాకు డబ్బు దొరకాలి అని గొఱ్ఱెలమందవలె ఆడవాళ్లు మగవాళ్లు గుంపులు గుంపులుగా మఠానికి వస్తూఉంటారే వాళ్లకి అందరికీ——

మహా——ఎడతెగకుండా ఆశీర్వాదాలు కుమ్మరిస్తూనే వున్నాను.

పౌరా——అది సరే. కాస్త ధోరణి కనిపెట్టి నాలుగు ఆశీర్వాదాలిస్తే అందులో రెండైనా నిజంగానే అవుతాయిలే. కాని వట్టి ఆశీర్వాదములతో పని సాగదు.

మహా——ఇంకేమి గావాలి మణి ?

పౌరా——నీలో యేదో అద్భుతమైన సామర్థ్యమున్నట్లు లోకములో లేని చమత్కారాలు నీవల్ల జరుగుతోఉన్నట్లు నలుగురికీ తెలిసి ఆవార్త చుట్టుప్రక్కల ఆమడదూరమువరకు పాకాలి.

మహా——లోకములోలేని చమత్కారాలే! అంతటి సామర్థ్యమే నాలో ఉన్నట్టయితే నాజుట్టు మీచేతి కెందుకిస్తానండి ? అప్పుడే నిత్యానంద మహారాజు స్వతంత్రంగా సంచారానికి వెళ్లకపోవునా ? చమత్కారాలేమిటో మీరేపన్నండి. ఇంక నే నీయాసనమువదలను.

పౌరా——అది నేను చూచుకుంటానులే. ఒకచమత్కార మేదయినా యీ తెలివిహీనులు చూడగలిగిరా వారిక లేనిపోని పది చమత్కారాలు తమ కేకల్పించి నీయొడిలో పోస్తారో లేదో నీవే చూతువుగాని.

మహా—అయితే, ఏమండోయి ఆముత్యాలహారాన్ని గురించి అంతా సద్దుమణిగిందా? లేకపోతే ఆముసలివాడు...

పౌరా—అది యింకా అట్టేవుండట్రా ఇదిగో ఇక్కడే నీబోటివాళ్లు పప్పులో అడుగేసేది. దీనికి మంచిధోరణి కావాలి. అయితే ఎవరి ధోరణి వారికే.

గీ. సహజముగఁ గొన్ని శక్తులు జననమొందు;
కాని; యివి, లభియింపవు కష్టపడిన
శ్రవణ తర్పణ కంఠస్వరంబు తాను
కోకిలము నేర్చుకొనియెనా? గురువుచెంత?

చండిక—ఎందాకా ఈమాటలింకా; దరీఅంతూవుందా? వడ్డించనా? హారతికోసము బైట అందఱు కనిపెట్టుకుని వున్నారు.

పౌరా—కూర్చుండనీ, ఇవ్వేళ మహారాజుగారి సమాధి త్వరగా ముగియలేదని చెపితేసరి. నడువు; మహారాజ్ నడువు; మడిలేకపోతే మానెగాని కాళ్లయినా కడుక్కోవాలావద్దా?

మహా—అదైనా ఎందుకు నీళ్లుదండుగ. ఇట్లాగే కూర్చుందాము.

(ఇద్దఱు పీటలపై నాశీనులగుచుండగా తెరదిగును.)

---

## చతుర్థాంకము

(స్థలము. భోగావతీనదీతీరము. నదియొడ్డున ననేకులు సుమంగళులై యుందురు. సరస్వతి, కామాక్షి, మీనాక్షి, చండిక, అంబిక, మొదలగుస్త్రీలు బిందెలు తోముచుందురు. త్రివేణి, యమున, కాళింది, సరయు, ప్రవేశింతురు).

సరయు—అయిందా నర్మదమ్మా! స్నానము, పూజ, పునస్కారము. నిన్నమా అందరిగతి బాగానే చేసారులెండి.

నర్మద—మీకెందుకు చెప్పిపోతినా! మీరంతా అక్కడికి ఎందుకు వచ్చారా అని అనిపిస్తూఉంది నా ప్రాణానికి. మీరు రాకపోతే నాకేమైనా పాపము చుట్టుకునేదా? అబ్బా! నిన్నటినుంచి అందరూ నన్నెల్లా గేలిచెయ్యబట్టుకున్నారు. నాకీసంగతి తెలిసివుంటే పొరుగునఉన్న పెద్దకుని తీర్చుకోసీగునవునే చూపిస్తును.

సరస్వతి—వద్దమ్మా ఇఘనువ్వు చూపించావద్దు ఏమీవద్దు.

నర్మద—అదృష్టవంతురాళ్లు గనక మీకుదర్శనమైనా అయింది. అయింది ఇఘ. అనుహారాజన్నా ఎందుకొంటూరు ఇక్కడ. ఆయనకు మనుష్యుల ఘాలేకిట్టదు.

యమున—ఆయన ఉండాలనిమాత్రము ఎవరు ఏడుస్తున్నారు. నర్మదమ్మా ఇఘ నిజంచెప్పనా నీవు నీఇంటిగురువును వెతుక్కున్నావు గనుక నీకతడు బాగున్నాడు. మా కొద్దమ్మా ఆదెయ్యాలవంటి గురువులు.

త్రివేణి—నిజమనే యమునా! గురువైతేమాత్రము మంచినోరుగలవాడైతేనే అతనికి సేవచేయ బుద్ధిఅవుతుంది. అదేమరీ మామహారాజుగారిని చూచినావు గదా. చూపులకు చక్కగా ఉండనే ఉన్నారు. కాని ప్రతిదాంట్లోను తీర్చినట్లు ఎట్లా—

చండిక—శ్రీవేణమ్మా! నువ్వు కొండో వాళ్లమాట లెన్ని చెప్పినా నిత్యానందం మహారాజుమాత్రము గురువులనందర్ని మించినవార న్నమాట అక్షరాలా నిజము. అతనిపేరే ఎంతఇదిగా ఉందో చూడు! ఎక్కడైనా ఏమయినా వంకఅన్నమాట ఉందా. వంటి కాంతి యెట్లా కారిపోతూఉంటుంది! ఎప్పుడు నవ్వుమొగము. అచ్చము కృష్ణవిగ్రహము. మరి ఇదిగో అతడు నిజంగానే రాజ యోగి. ఆయనకే తక్కువలేదు. ఆమఠము ఎంతపెద్దది! ఆయన ఆసనమో రాజసింహాసనము. చెవులకి ఆకుండనాలు, ఆ నింపుజల తారు పెద్దకోటు అన్నీ అతనికి యెంతో అందముగా ఉంటాయి గదా! దర్శనానికి ఆడవాళ్లొచ్చినా పిల్లలువచ్చినా పల్లెత్తుమాట గాని కోపంగాని యేమయినా?

కాళింది—నిజమే. ఓనాడు నేను కామాక్షిపిన్ని వెంట మఠానికి వెళ్లాను. అప్పుడు దేవభక్తులవారి కొత్తపెళ్లికొడుకు పెళ్లికూతురు సాములారికాళ్లు మొక్కేందుకొచ్చారు. పెళ్లికొడుకేమో సాములారి పాదాలమీద నెత్తిపెట్టాడు. పెళ్లికూతురు దణ్ణముపెట్టడానికి ముందుకువెళ్లేసరికి, ఆవధువును తనతొడపై కెత్తుకుని తలపైనుంచి మహారాజు చేయిత్రిప్పినాడు. తనచేతితో దానినోట పంచదారపెట్టినాడు. ఏదోరహస్యముకూడా చెప్పినాడు. తరువాత ఆశీర్వదించినాడు. మేమంతా ఆశ్చర్యపోయినాము.

నర్మద—ఎబ్బే! ఇంత పెద్దఅడ్డగాడిదవంటి పిల్లను అతడు తనతొడ మీద కూర్చోపెట్టుకోవడమేమిటి?

సరస్వతి—ఇప్పటిపిల్లలు మహాగడుసువాళ్లులే.

నర్మద—దానిని తొడమీద కూర్చోబెట్టుకున్న యీ చచ్చినాడు మాత్రము గడుసువాడు కాడు కాబోలు.

కాళింది—ఏమిమాటలవమ్మా నర్మదమ్మా! యివి? నిజముగా నీ మనస్సు పాపిష్టిమనస్సు, అందుచే యీవికల్పములు వస్తున్నాయి. శ్రీగురువులువారు దేవతాసమానులు, వారికి లేనిపోని పేరులుపెట్టి తివిగాన ప్రాయశ్చిత్తము అనుభవింపవలసియుండును.

చండిక—నిజమే నీ మనస్సు పాపిష్టిమనస్సే. మహారాజుగారి మనస్సు లోనికి పనికిమాలిన ఆలోచనలు వస్తాయా! పౌరాణికులుగారు రామయ్యగారు మరెవరెవరో నెత్తివాళ్లయి యేనా అయనకు సేవ చేస్తుంటు. ఊరంతా పౌరాణికులుగారిని సేనా చదువుకున్న వారని అంటున్నారు. రామయ్యగారినికూడా అల్లాగే అంటున్నారు.

నర్మద—ఆఁ రామయ్యయేమిటి! చదువేమిటి! అల్లాగే ఎవరో చెపితే ఒకనాడు మంత్రానికి పిలిచారు మాయింటికి, అయితేవాడు నోరు విప్పితే ఒట్టు, పొట్టపొడిచినా అక్షరమ్ముక్క లేదు. మూగవాడెల్లా కూలపడ్డాడు. సరే అప్పుడువీడు పెనుకే బ్రాహ్మడని మావార న్నారు. నేనీ చెవులతోనే విన్నాను.

చండిక—మీ వారిచదువు మహావెలిగిపోతూంది. (ఆలోచించి) ఆఁ అన్నట్టు నర్మదమ్మా! యివ్వేళ యీ చిలునలుపలువలు ఎందుకో నాకు తెలిసింది. ఆ నాడు నువ్వు సంధ్యహారతి యెత్తితే మహ రాజుగారికి సమాధానము కాలేదు.

యమున—ఏమిటమ్మా! అడ్డమైనవాళ్లూ చేసే వేడుకలకు అతడు ఎల్లా యిష్టపడడము?

చండిక—ఆనాటినుంచీ నర్మదమ్మమఠములో కాలుపెడితే ఒట్టు. ఈ విడ రాకపోతే దేముడు చచ్చిపోతాడా!

నర్మద—నేను దిద్దుకునీ తీర్చుకునీ కాలికేదాన్ని అయితే అయనకి సమాధానమయ్యేది. నేను అట్లాంటిదాన్ని కాదాయెను. వాడు—

పొరపాటు ఆ దేవుడు వయ్యారాలు, టక్కరిచేష్టలు, కినుక్కని నేను మఠములో కాలుపెట్టడము మానుకున్నాను. మూలవిగ్రహాలు ముష్టియెత్తుతుంటే ఉత్సవవిగ్రహాలకి దధ్యోదనమట. ఆ దేవు డెక్కడఉన్నాడోగాని ఈదేవుడు వేడుకలే బలంగా ఉన్నాయి.

చండిక—నర్మదమ్మా! నీనాలిక్కి నరమేమయినా ఉందా? ఏమో మనరాతలో లేదని నోరుమూసుకుని కూర్చుంటారా. లేక నోటికి వచ్చినట్లల్లా వాగి, పాపము ఒడికట్టుకుంటారా?

నర్మద—సమాధిలో కూర్చుంటారట. వాడితలకాయ సమాధి. ఊరికే కళ్లుమూసుకు కూర్చుంటాడు. అంతే, ఏడేం గురువమ్మా!

చండిక—ఒకమాటు నీకు కాస్త చమత్కారము కనపడితే, నీ అంతట నీవే నోరుమూసుకుంటావు. అవునా కాదా! కామాక్షమ్మా! ఇన్నాళ్ళ నీవేమో మానముదాల్చావు.

కామాక్షి—ఈ ఆడిపోసుకోవడాలు నాకొద్దమ్మా తల్లీ! (కాసీకావిడితో పద్మనాభుడు ప్రవేశించును)

పద్మనాభుడు—(చాలా అలసినట్లు నటించుచు) బొత్తిగా కంఠానికి వచ్చాయి ప్రాణాలు. (కావిడిక్రిందపెట్టి) దేవుడా! ఆపాదాలు (సొమ్మసిల్లినట్లు పడిపోవును. స్త్రీలు జలము నోటపోతురు. వద్దని సైగచేయును. ఎత్తికూర్చుండపెట్టుదురు.) చివరికి ఆపాదాలు దర్శనము కానిదే నేను మృత్యులోకము బాసితినా! ఆ! ఇది స్వర్గలోకమువలెనే యున్నదే. వీళ్ళే అప్సరస్త్రీలు దేవాంగనలున్నూ. (చండికాంబికానర్మదలను చూచి) అయితే ఏరెవ్వరు! వీళ్లిక్కడికి ఎట్లావచ్చినారు.

చండిక—ఏమిటికి మీరు యిట్లా పిచ్చిపిచ్చిగా మాట్లాడుతున్నారు. ఎక్కడి స్వర్గలోకము యేమికథ.

యమున—అయ్యా! యిది కుంజపురము. ఇవ్వేళ గంగమ్మ ఉత్సవమని నదికి స్నానానికి వచ్చాము.

పద్మ—మొత్తానికి ఇదంతా భ్రమే? అయితే నేను బ్రతికున్నట్టేనా? సద్గురూ తమలీల అగోచరము.

అంబిక—మీది ఏవ్వూరు? ఈ కావిడ యెక్కడనుంచి తెచ్చారు?

పద్మ—నే నుండేది సువర్ణపురము. గంగకావిడి రామేశ్వరము పట్టుకు వెళ్లుచుండగా నడమధ్యాని చాలా జబ్బుపడ్డాను. అందువల్ల మనో వ్యాధి సంభవించింది. ఎటూతోచక ఈసమీపాన్ని ఆలయముందే అంచులో పోయిపడ్డాను. కాస్సేపటికి నిద్రావస్థలో పడి కల కన్నాను. శ్రీసద్గురు! సద్గురు! ఆకలలో నాకు శ్రీరామేశ్వరుల దర్శనమైనది. ఆహాహా! ఏమి ఆ యీశ్వరుని ఆజానుబాహు విగ్రహము! మెడలో పుత్రైల హారము!

నర్మద—ఎంతపుణ్యాత్ములండి మీరు. ఏమిటి వారు ప్రసాదించింది మరి.

పద్మ—ఈ కావిడి కుంజపురము తీసుకుని వెళ్లి నిత్యానంద మహారాజుగారి కర్పిస్తే నాకు అది అందినట్లే అని సెలవైంది. కాని యీ సంగతి యెవరికీ బొత్తిగా తెలియనివ్వవద్దనిమాత్రము ఆజ్ఞ అయింది.

చండిక—విను. బాగా ఆలకించి నర్మదమ్మా!

నర్మద—(ఏడుస్తూ) మహారాజా! నేను పాపిష్టిని చండాలురాలను నేను తమరిని గుర్తించలేక అనరానిమాట లన్నాను.

చండిక—(తనలో) చచ్చింది, ఏడుపారంభించింది, పెద్దపెద్ద మొనగాళ్లను జడ్జీలను చదువుకొన్నవాళ్లను చిలవలుపలవలు యేరేవాళ్లను నేలపెట్టి ముక్కులు రాయించాను ఏమనుకొన్నావో. నువ్వెంత. (ప్రకాశముగా) ఇంతదుఃఖ మెందుకమ్మా. అందరివల్లా

అపరాధాలు అవుతాయి. మీకు దాఖలా కనపడడము మంచి దయింది.

పద్మ—ఇంక నా కాపాదాలదర్శనము చేయించండి. వారిదర్శన మయ్యే వరకు నేను నోట్లోనీళ్లు కూడా పోసుకోను.

చండిక—కామాక్షమ్మా. వీరిని మీయింటికి పిల్చుకొనివెళ్లు పాపము అతను మఠమువరకు నడువలేడు. మహారాజుగారి పఠము దర్శనము చేసి పట్టెడన్నముతిని అప్పైన మఠానికి వస్తాడు.

కామాక్షి—సోమయ్యా! వీరికావిడి కాస్తపట్టుకుని పద. (సోముడు ఎత్తబోవును)

పద్మ—ఆఁ ఆఁ ఆఁ గంగా దేవికి సూద్రుడి స్పర్శదోషము అవుతుంది. (కావిడి ఎత్తుకొని నడచును)

సరస్వతి—ఎంతప్రొద్దెక్కిందో చూసారా! ఇంక గంగమ్మకు పసుపు కుంకుమతో పూజచేద్దాముఅండి.

(అందరు నిష్క్రమింతురు)

---

# తృతీయాంకము



## ప్రథమరంగము

(మహారాజుగారి పఠమొకటి సింహాసనముమీద సమర్పబడి యుండును. దీపములు హారతులు వెలుగుచుండును. వెండిపూజా పాత్రలు పుష్పముల పళ్లెరములు సమర్పబడియుండును. కామాక్షి పూజచేయుచుండ రామయ్య మంత్రములు చెప్పుచుండును)

రామయ్య—ఇకవచ్చినిన్నీ మహారాజుగారి ధ్యానముచేయండి.

కామాక్షి—గీ. ఆర్తకరక్షక! దేవ. దయాపయోధి!

బాధసంసారతమముఁ బాపంగఁజాలు

నందనుని వేగి దయచేసినాకు నవల

నందఁజేయుము చిన్మయానందపదము

రామయ్య—కామాక్షమ్మగారూ! ఇక బ్రాహ్మణుల పూజచేస్తే సమాప్తమవుతుంది. అద్యపూర్వోత్తర వర్తమాన ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభ పుణ్యతిథౌమమ—మమ అనండి,— మమ ఆత్మనః శ్రుతిస్మృతి పురాణోక్తఫల ప్రాప్త్యర్థం సాంగతా సిద్ధ్యర్థ ఆచార్య పూజనమహం కరిష్యే నీళ్లువదలండి నా నెత్తి మీద వచ్చి యీ అక్షింతలుంచండి. (కామాక్షి అక్షితలు వేయును.) ఇక వచ్చినిన్నీ మీశక్తికొద్దీ సంభావనయిచ్చుకోండి. (కామాక్షి దక్షిణ యిచ్చి నమస్కరించును.)

అష్టపుత్రసౌభాగ్యవతీభవా (బియ్యము వగయిరా మూట కట్టుకొని రామయ్య నిష్క్రమించును.)

(బసవరాజు ప్రవేశము)

బసవరాజు—అయిందా పూజ. రోజూ యిల్లాగే యింటివద్దనే చేసుకుంటేచాలు. అయితే యేమిటో చెప్పబోయినాను. ఆఁ వస్తువు పెట్టిలో జాగ్రత్తగా ఉంచావా ?

కామాక్షి—ఇంటికి వస్తూనే ముందు ఆపసిచేసే పూజ మొదలుపెట్టినాను. ముత్యాలహారముకోసము యివ్వేళ లేనిపోని అల్లరి అయింది. శ్రీ దేవి మెడలో వెయ్యడానికని మొన్న మహారాజుగారు నన్నడిగినారు. ఆ యింతపనూటా మీతో చెప్పడము మఱచాను. ఇవ్వేళవెళ్లి కాస్త కూర్చున్నానో లేదో వెంటనే అప్పాల వాళ్లలాగ పిలిపించారు. మరి మహారాజుగారు అప్పుడు అక్కడే కూర్చున్నారు.

బసవ—ఏమో జరిగిపోయింది పోనిస్తూ

కామాక్షి—ఇల్లాగే యెప్పుడూయేదో అవుతోనే ఉంటుంది. మనసులో అనుకోడమువకటి నడమంత్రమున జరిగేదిమరొకటి. ఇల్లాగైతే మనస్సుకి బాగాఉండదుసుమండీ.

బసవ—ప్రపంచములో యిల్లాజరుగుతోనే ఉంటుంది. అయితే నీవు మనస్సులో తల పెట్టిందేమిటోచెప్పు.

కామాక్షి—మహారాజుగారిని ఓనాడుమనయింటికి తీసుకునివచ్చి వారి ప్రసాదము యిక్కడే అందపూ పుచ్చుకోవాలని మీరన్నారే

బసవ—అవును అన్నానుగానీ—

కామాక్షి—అయితే యింతలోనే యేమయినా ఆటంకము వచ్చిందా?

బసవ—ఛ ! ఆటంకములేదు గీటంకమురాలేదుగాని

గీ. మంచిచెడ్డలు చూడనిమనుజులెప్పుడు
లోకనిందకుపాలయి ప్రాకటముగ
బాధపడుచుంద్రు సుఖమును బాసిమిగుల;
మంచిపేరుగడించిన మహిమె దివము.

కామాక్షి—మహారాజును మనము పిలుచుకుంటే అందులో మెవరి కేమి నష్టము? వాళ్లు సొమ్ము మనకేమైనా యిస్తారా?

బసవ—సొమ్ముమాట కాదు కాని లోకుల మాటలును పూర్తిగా లక్ష్య పెట్టకపోవడము మంచిదికాదు.

కామాక్షి—లోకులు లోకులు అంటారే వారెవరో నాకు పేరేటలో చెప్పనైనా చెప్పండి.

బసవ—మా స్నేహితులే యింకెవరు!

కామాక్షి—అయితే యింక చెప్పనా. మహారాజుగా రెటువంటివారో వాళ్లకి తెలవదు. అంచేత యేమయినా వాగారేమో. మనస్సులో తలపెట్టినదేదీ అట్టే వుంచకూడదంటారు. మంచిదికాదు. ఎల్లామతి?

బసవ—నీ కంత పట్టుదలగా ఉంటే పిలుద్దాము ఇంతేనా? మరి యింకేమిటో అనబోయినాను. ఆఁ నీవు ప్రతిరోజూ తప్పకుండా సంధ్యా హారతికి పానుపునకు వెళ్లుతూ ఉంటావు. ఇది కాస్త బాగాలేదని తోస్తుంది. వారాని కొకమాటో రెండుమాట్లో వెళ్లి మహారాజు గారి దర్శనము చేసుకుంటూంటే చాలు.

కామాక్షి—ఇందు కేనా! 'ఇంట్లోనే పూజచేసుకున్నావు మంచిపని చేసా' వన్నారు? 'మఠానికి వెళ్లి మహారాజుగారి సేవ చెయ్యి' అని మీరేగాదూ లక్షమాట్లైనా చెప్పింది.

బసవ—అవును. నేను చెప్పినది వాస్తవమే.

కామాక్షి—మరి యీ మారడము యెందుచేత? మహారాజుగారి సేవ చేసి వారి దయవల్ల సంతానము కలిగితే యిల్లు యిల్లవుతే ఉంటుంది.

బసవ—అవును గాని కాస్త లోకుల నిందకు ఝడియవలసిఉంటుంది.

కామాక్షి—ఆభయ మవసరము లేదు. మరి వారి నెప్పుడు మనము పిలవడము. తెలిసిఉంటే మంచిది.

బసవ—పిలవడమే తప్పనిసరి అయితే ఎప్పుడో యెందుకు రేపూ. రేపు ద్వాదశికూడాను. అయితే నీ వొక పని చెయ్యి. నీవు పిలవదలచిన ఆడంగులనే పిలువు. అప్పటికి తేలికగా వదిలిపోతుంది. ఇప్పుడే వెళ్లి పిలచిరా.

కామాక్షి—మరి మీరు మీ స్నేహితుల సందర్శి తప్పకుండా పిలవండి. వాళ్లు మహారాజును నిందించినారు కాని పాపము మహారాజు మనస్సులోకి అటువంటి వేమీ రావు సుమండీ. సుజనులు కుజనులు అతనికి సమానులే ఆ సదయుని పాదములకు శరణుచొచ్చిన వారు మోహముక్తులయి మోక్షమును పొందుదురు.

బసవ—సరే పద. ఇంక ఆలశ్య మెందుకు?

[నిష్క్రమింతురు.]

---

## ద్వితీయరంగము

---

స్థలము—కుంజరపురపు మఠములోని మహారాజు పడకగది.
(మహారాజు మంచముమీద పరుండియుండును. మీనాక్షి కాళ్లు పట్టుచుండును)

మీనాక్షి—అయితే స్వామీ! నే నెవతెను తమ రెవరు? ఎంతయినా నేనె యూరివారు దిగదుడిచి పారేసినదానను. పగిలిపోయిన కుండ వంటిదానను.

మహారాజు—ఇటువంటి మాటలు లక్ష్యపెట్టవలసినవారెవరు? సాధారణమైన మానవులు. విను.

గీ. అనుసరింతుము మీనాక్షి ! యనవరతము
దేవతలమార్గముల మేము దీక్షతోడ ;
ప్రేమయే సుమ్ము సురలకు ప్రియకరమ్ము
కలుగనీకుము మదిని వికల్ప మింత.

మీనాక్షి—అనగా !

మహారాజు—అనగా దేవేంద్రుడు ప్రేమకు లోబడియే అప్సరాదుల నంగీకరించినాడుగదా. సరే మరి. వాడును మేమును యిరువురము స్వర్గీయులమే. ఈ మృత్యులోకములోని పాపాత్ముల నుద్ధరించుటకు మే మిట బసచేసియున్నాము. ఇంతే తేడా. అప్పటికి భేదాభేద ములు మాకైనా యెందుకు.

మీనాక్షి—అయితే మహారాజుగారూ! తమరు బ్రహ్మణులు. నేను...

మహారాజు—అదిగో ! తిరిగి ఆమాటేనా ? విప్రులు శూద్రులు అన్న భేదము లౌకికవ్యవహారములకు సంబంధించినవి. దేవతలలో యీ భేదము లేదు గనుకనే శ్రీరామచంద్రుడు శబరి యెంగిలి గ్రహించి నాడుగదా !

మీనాక్షి—మహారాజా ! నే నజ్ఞానురాలను. నా కీమాటల......

మహారాజు—అగునే. గనుకనే యెవరివారి యధికారమును బట్టియే మే మేదైనను విశదీకరింతుము. ఆమాట లట్లుంచుము. నీ వెఱ్ఱి యభిప్రాయమును బట్టి చూచిన యేబ్రాహ్మణుడైనా అన్యజాతి స్త్రీని వివాహమాడినవా డెప్పటికి పతితుడు కాజాలడు. గాని ఆ స్త్రీకి మాత్రము విప్రత్వము లభించునని శాస్త్రములు ఘోషించు చున్నవి. ఎటు చూచినను నామాట కెట్టి యభ్యంతరము రాజాలదు.

మీనాక్షి—అయ్యా! తమతో నే నెంతవఱకు మనవిచేసికోగలను. గాని నాకు తోచినంతవఱకు నేను అనివేస్తాను.

మహారాజు—అభ్యంతరమేమి. కాని నీ యూహాలు ప్రకటించుకొలది నా కుత్సాహము హెచ్చును. నీ చాతుర్యము నా కెంతయు ముచ్చటగా నుండును. నీపై నాకు గల ప్రేమ మఱింత ప్రకాశించును. అందువలన నష్టమేమి?

మీనాక్షి—తమరు నా దేవతలు, నేనమాయకురాలుతో తమ పాదాలకు శరణు జొచ్చినాను.

గీ. ఇనుము మాలిను పరుసవేదిని స్పృశించి
నేను మిమ్ము స్పృశింప మీమాననమ్ము
వికలతను బొందు నేని లభించు టెట్లు?
మీవలన నాకు సద్గతి దేవరాయ!

మహారాజు—అందుగల రహస్యము నీకు బోధపడలేదు. నీవే కర్మనిష్ఠుడవైన బ్రాహ్మణుడవై యుండిన యే జపమో అనుష్ఠానమో జేయుమని చెప్పుదుము. ఏదైనా వ్రతమాచరింపవలయునని నీకు చెప్పిన అది నీకురుచింపదు. ఒకవేళరుచించెనా దానిఫలము నీవు దక్కించుకొనజాలవు. వాల్మీకునికథ నీవెఱుగవా? వానికి నారదుడు...ఇటీవల నారదుడు బొత్తిగా కనుపించుటలేదు. ఏలోకమున సంచారము చేయుచున్నాడో వానికి పనేమున్నది.

మీనాక్షి—(తనలో) నారదుడు కనపడడమా!

మహారాజు—నారదుడు వాల్మీకికి "మారామారా" అని జపింపుమని చెప్పియుండలేదా? అందువల్లనే వాల్మీకు డుద్ధరింపబడలేదా? అజామిళుని సంగతీ అంతే.

మీనాక్షి—అది నిజమే ఈశ్వరునికి భక్తిగదా కావలసినది.

మహారాజు—స్త్రీకిగల యజ్ఞానమిదియే. ఈశ్వరునియందు భక్తినిలుపు టెందులకు? వానిని వశపఱచుకొనుటకు. నీవు నన్ను ఈశ్వరునిగా భావించి యున్నావుగదా.

మీనాక్షి—(తనలో) ఎంతవఱకో యీఅధముడు మాటలు పెంచుట (ప్రకాశముగా) చిత్తము. అట్లనేనండి అయ్యా!

మహారాజు—అటులైన యేవిధముచేత నామనస్సు ప్రసన్నముకాగలదో అదేనీకు కర్తవ్యము. భక్త భక్తియననేమి? ఇదే. నవవిధముల భక్తికి తాత్పర్యమిద్దియే.

మీనాక్షి—అయితే ఇటువంటి భక్తికి యీశ్వరుడు మెచ్చినట్లు పురాణములలో యెచ్చటను చెప్పియుండలేదే.

మహారాజు—ఏబదిచోట్ల చెప్పియున్నది. లేకేమి, రేపల్లెలోని గోపాలురు గోపికాస్త్రీలు శ్రీకృష్ణుని భక్తులని చెప్పియున్నది. తెలునునా?

మీనాక్షి—అగును దేవరా? తెలుసును.

మహారాజు—అయితే ఆగొల్లలు ఏతపస్సాచరించిరి? ఆగొల్లలు పెట్టిన చద్ది శ్రీకృష్ణుడెంతయు రుచితో నారగించువాడు. ఇక నాగోపికలును రాధయును శ్రీకృష్ణుని కేవలము వెఱ్ఱివానినిచేసిన సంగతినీకు తెలిసియున్న విషయమేకదా! రాధ కృష్ణున కేమిచ్చినది. ప్రేమ.

మీనాక్షి—రాధ యదృష్టము రాధకే, నాకట్టిదేది? పామరురాలకు! గాని రాధాకృష్ణులకుగల అన్యోన్య ప్రేమనుగురించి పురాణములలో విరోధముగా...

మహారాజు—ఈపురాణీకులసగా నెంత? వారికిగల జ్ఞానమదెంత? ఈమర్మములు వారేమెఱుగుదురు. ఇంక పౌరాణికులు లీలాంశములను విశదీకరించుట నీ వెప్పుడు వినలేదా? తాత్పర్య మేమనగా శ్రీకృష్ణుని

తన ప్రేమపాశముతో బంధించివైచినది.

మీనాక్షి—అది కాదుకాని దేవా? నేను విన్నదియిది...

మహారాజు—ఇదీకాదదీకాదు. రాధచే ప్రేమపాశమున గట్టబడినవాడు కనుకనే కృష్ణునికితరయే స్త్రీమీదను ప్రేమలేకపోయినది అందుకనే అందఱు రాధాకృష్ణ రాధాకృష్ణయనియే జపింతురు. రుక్మిణీకృష్ణ యనిగాని సత్యభామాకృష్ణయనిగాని యెవరు ననరు.

మీనాక్షి—ఇది రాధాకృష్ణలను గురించి అయినది. మఱి సీతారాములు పార్వతీపరమేశ్వరులు మాటయేమిటి? వారి సంబంధమున నేయసందర్భాలు చిక్కులు లేవుగదా!

మహారాజు—పార్వతీ పరమేశ్వరులపేర జయఘోషచేయునది వృద్ధులు. మాశంకరుడు ముసలివాడు. ముసలివారిపనులముచ్చట ముసలివారికే, యువకులు సమవయస్కులుజపించవలసినది రాధాకృష్ణయే.

మీనాక్షి—మహారాజుగారూ! నాకు జ్ఞానమబ్బవలెనని నేను తమ శరణుజొచ్చితిని. తమరు నాగురువర్యులు. నేను తమ శిష్యురాలను. గురుశిష్యుల సంబంధములో నిట్టి ప్రసంగము బాగుండునా?

మహారాజు—ఆఁ నీవన్నదే నేను చెప్పుచుంటిని. గురుశిష్యులకు తండ్రి కొమారుడువంటి సంబంధమే యుండవచ్చును. గాని శిష్యురాండ్ర కట్టి సంబంధము యెవరు నెపుడు చెప్పియుండలేదు. నీవు మంచి బుద్ధిశాలివేగాని యిట్టి తర్క వితర్కములలోబడి నాస్తికులలో చేరకుము.

మీనాక్షి—(తనలో) ఇంకేమి కావలెను. కాని యీవేళ యికేమియు మిగులుపకూడదు (ప్రకాశముగా) నేను నాసర్వస్వమును సమర్పించుకొని తమపాదముల నాశ్రయించితిని. అందుకు కారణమేమన నన్నుద్ధరించుకొనుటకే, మఱినాకు నాస్తికము గీస్తికముతో పని

కాదు. నేనజ్ఞానురాలను. నాకుగల సందియములన్నియు తమరు దీర్పవలయును.

మహారాజు—నీసందియములన్నింటిని తీర్చెద, మంచిది. నీవేమనుచుంటివి. హా! సర్వస్వము నర్పించితిననిగద. అయితే, సంకల్పముచేసి కొన్న ప్రకారముగానే నీవుజరుపగలవా? లేక సంకల్పములో సువర్ణమంత్రపుష్పదక్షిణమని చేత నిన్నియక్షితలో లేక నాకతులసీదళమో పెట్టినట్లు చేసెదవా?

మీనాక్షి—ఒట్టిసంకల్పమేనా? నా సొత్తంతయు నాచేతులార మీ కర్పించిన పిదప గదా నేను తమ నాశ్రయించినది. (తనలో) నీ మొగమున తగులపెట్టితిని.

మహారాజు—(తనలో) అదంతా అప్పుడే స్వాహా అయిపోయినదిలే. అయితే యింతటితోనే పూర్తియగునా? (ప్రకాశముగా) అయితే యింతటితోనే నీ సంకల్పము పూర్తిచెందెనా?

మీనాక్షి—అవును. ఈపాదముల సేవచేయుటకు నా హస్తములను కూడ అర్పించితిని.

మహారాజు—ఇదేటిసేవ. ఇట్టి సేవ యెవరెవరికైనా చేయగలుగుదురు. నీవు నీకృతిచేత రాధను మించిపొమ్ము. (కౌగలింపబోవును. కోపోద్రేకమున దూరమునకు తొలగి మీనాక్షి నిలువబడును)

మీనాక్షి—ఓరి వేషధారిహాతకా!

గీ. ఓరి! నీచాతినీచ! మహోగ్రపాపి!
చూపులకు నీవు పైకతిసురుచిరముగ
కానుపించుచు నున్నను కలదు విషము
నీ హృదంతరమందున నిక్కువముగ.

నీ వెవరెవరి కొంపలు ముంచనుంటివో. అందఱి కన్నులెట్లు

మూసికొనిపోయినట్లు తెలియకున్నది.

మహారాజు——వలదు వలదు నీవు విరోధభక్తి నంగీకరింపరాదు. ఇది యొక్క రావణాసురునికే ఫలమిచ్చినది. నీబోటి కోమలాంగికి (చెంత కేగబోవును)

మీనాక్షి——(క్రోధముతో విదిలించి) నేను ప్రత్యక్షముగా వేశ్యను గాని యధముడ!......

చండిక——(తెరలో) అయ్యా మహారాజుగారు! ఇవ్వేళ యెంత ప్రొద్దు పోయినది! దర్శనాని కందఱు వచ్చి వేచియున్నారు.

మహారాజు——ఇదుగో వచ్చుచునే యున్నాను. (నిష్క్రమించును)

---

తృతీయరంగము

---

స్థలము బసవరాజుగృహము

(బసవరాజు; కామాక్షి; చండిక; అంబిక; మాటలాడుచుందురు. సోమడు మహారాజాసనమును దులిపి అమర్చుచుండును)

చండిక——మారాజుగారి సంగతి పలుగాకులకు తెలియదనా! బాగా తెలిసి నిప్పుమీద కాలువెట్టి వాతేసుకుంటారు. మతేమిటి. ఆముండాకొడుకులు యిల్లా నోటికివచ్చినట్లల్లా నాముందర వాగినట్టయితే ఎడమకాలి చెప్పుపుచ్చుకొని దవడపళ్లు రాలగొట్టనూ.

బసవ——నేను అనవలసినది మంచితనంగానే అన్నాను. ఏమిచెప్పను పిన్నీ! మహారాజుగారిని దూషించడమేగాక నామొగము పట్టుకుని 'నీకిది నాలుగవభార్య కాస్తమానము కాపాడుకోవాలి' అన్నారు అంటే నాయిల్లాలు సామాన్యురాలుకాదు. మంచి మంచివాళ్లు

కూడా దాని కాళ్లుకడిగి తీర్థము పుచ్చుకోవచ్చునని నేనూ జవాబు చెప్పినాను. బాగావుందా?

చండిక—ఏమంటె యేముంది ఆముండావాళ్లను. వాళ్లకే సిగ్గుభిడియా లుంటేనా? బసవరాజుగారూ! మీయిల్లాలు నిజంగా మీరు చెప్పి నటువంటిదే సుమండీ. ఇటువంటి యిల్లాలు మీకు దొరకడం చాలా అదృష్టము. లేకుంటే చూస్తూనే వున్నాముగాదూ! ముసలి తనములో పెళ్లిళ్లు చేసుకున్న వాళ్లాపాట్లు.

కామా—నోరువిప్పి యింతమాత్రమైనా అనగలిగినారు ఇదీ నాఅదృష్టమే. ఈజగత్తులో నీచులు దుర్జనులు ఖలులు దొంగలవలె రహస్యముగా నుందురు. వారికిగల వ్యాసంగము పరులనిందించుటయే. లోకులను మోసగించి సుజనులపై నిందయనెడు గరళమును చల్లి వారిని బాధించుచుందురు. అప్పుడు నోరుమూసుకుని యూరుకున్నట్టయితే యింకేమున్నది! వాళ్లుకూసిన కూతలే నిజమయ్యేవి.

బసవ—చండికమ్మా! ఇదెంతయినా కలియుగముకదా. వీళ్లను కలి బాగా లోబఱచుకొన్నాడు. విద్యాధరుడుమాత్రమెల్లాగో తప్పించుకున్నాడు. పాపము బ్రతికిపోయినాడు.

అంబిక—వాడికిమాత్రము చాలా భక్తియున్నది సుమా! చండికమ్మా! మారాజుగారెప్పుడేమి చెప్తారో కనిపెట్టుకుని వింటాడు పాపము.

చండిక—ఆఁ మీదికి బాగానే కనుపడుతాడు. సరేగాని మారాజుగారు వచ్చేవేళయినది. ఇప్పుడీ పుక్కిటిపురాణా లెందుకు.

బసవ—నేనూ అదే అనబోతున్నాను. అయితే పిన్నీ! మహారాజుగారు రాగానే చేయవలసినదేమిటో యొకపరియాయము దానికి నాకునూ చెప్పి వుంచండి. బాగుంటుంది.

చండిక—అల్లాగే, అంతా యథావిధిగా జరిగిపోతే మాటదక్క

తుంది. కామాక్షమ్మా! పంచహారతిలో వత్తులువేసి వుంచావా! లేకుంటే త్వరగావేసి వుంచు మహారాజుగారు తలవాకిటికి రాగానే వారికి హారతియియ్యి.

బసవ—అది హారతి యెత్తినతరువాత నే నేమిచెయ్యాలి.

చండిక—అంతా చెప్తాను తొందరపడకండి. ఆవిడ హారతియిచ్చిన తరువాత మీరు చేయిపట్టుకుని వారిని లోపలికి తీసుకునివచ్చి ఆసనముమీద కూర్చోపెట్టండి. ఇవ్వేళ రేవతమ్మ ఉపదేశము పుచ్చుకుంటుంది. ఆపైని, కామాక్షమ్మ! నీవు ఆవిడ కలసి ఆయనకు నీళ్లు పొయ్యండి.

బసవ—నేనువెళ్లి యింటియేర్పాటులు చూసివస్తాను. (నిష్క్రమించును.)

అంబిక—మహారాజుగారు మఠములోనే స్నానము చేస్తారేమో.

చండిక—నీ తెలివి తెల్లారినట్లే ఉన్నది. ఇన్నాళ్ళూ చూసీ చేసీ చివరకింతేనా? ఇవ్వేళఅందరూ యిక్కడ తీర్థము పుచ్చుకోవలసివుంటుంది. తెలియదా? కామాక్షమ్మా! నేను చెప్పినదంతా జ్ఞాపకముంచుకొని అన్నీ సరీగా చెయ్యి.

కామా—అంతా నీవుచెప్పినట్లు చేస్తాను. మరేమి బెంగపెట్టుకోకు.

చండిక—భయమేలేదట. నిన్న మహారాజుగారికి తలనొప్పివస్తే కాస్త మంచిగంధం కర్పూరము అరగదీసి పట్టువేసి కాస్తపాడుతూ జోకొట్టుమంటే ముఖము చిట్లించుకున్నావు. అంబికమ్మ అయితే చేసియుండును. చెప్పరానిపని చెప్పినానా యేమయినానా?

అంబిక—ఏమిటో లేతూ. ఇల్లాగయితే మరీమె చేసే సేవయేమిటి?

(బసవరాజు ప్రవేశించును.)

రామయ్య—(పరువెత్తివచ్చి) మహారాజుగారు బయలుదేరి కృష్ణేశ్వరాలయమువఱకు వచ్చినారు. పౌరాణికులుగారు మీకుచెప్పి

రమ్మన్నారు.

అంబిక—అయితే రామయ్యగారూ! ఎంత ఆయాసపడుతూన్నారండీ మీరు.

రామయ్య—ఒక్కతీరుగా పరువెత్తుతూనే వచ్చినాను మఱి. చిన్న పిల్లలవలె పరుగెత్తేయీడా మరి యిప్పుడునాకు.

చండిక—మహారాజుగారి పని అయ్యేను మఱి. దానికీడేమిటి చిన్నా పెద్దా యేమిటి.

రామయ్య—అయితే అంతా సిద్ధముగానే ఉన్నవని పౌరాణికులు గారితో చెప్పనా?

చండిక—ఆహా! బాగా చెప్పండి. కామాక్షమ్మా! చూశావా? పౌరాణీలుగారి కెంతశ్రద్ధో. బ్రాహ్మడు చాలా సాత్త్వికుడుసుమా ఇక నీవు పంచహారతిపట్టుకుని వెళ్లి వీధిగుమ్మములో నిలుచో ముందఱ ఆయనపాదాలిమీద కాసిన్నిపాలుమాత్రము చిలకరించు సుమా.

రామయ్య—(ముందుకుచూచి) పౌరాణికులుగారు రానే వచ్చినారు. అదిగో. (పౌరాణికుడు ప్రవేశము)

పౌరా—చండికమ్మగారున్నారుగద. సరే యింకేమికావాలి.

బసవ—(పరికించిచూచి) మా వారందరు దయచేసినట్లున్నది.

చండిక—దాపరించినారు. మీమూలక ఈ వెధవలు యింక యిక్కడ కొంటెతనాలు ప్రారంభించితే వీళ్లకర్మము కాలిందన్నమాటే మా రాజుగారికి కోపమురానంతవరకే అతని మంచి అంతాను. ఇక కోపమువచ్చిందంటే మాత్రము కష్టమే. వట్టిపుణ్యానికి వీళ్ల పెళ్లాలు ముండామోస్తారని నాకుజాలిగా వుంది.

పౌరా—బసవరాజుగారూ! వీరందఱూ యింతవిపరీతమైన స్వభావము

గిలవారేనా అండి. కాసిన్నండి మాకేమీ సంబంధము మీతో లేదుగదా. కాని విపరీతమేమీ జరగకుండా చూసుకో వలసి యుంటుంది.

చండిక—చేసినవాడనుభవిస్తాడు. దానిజోలి మనకెందుకు?

పౌరా—గనుక బసవరాజుగారూ! మీకొక యుపాయము చెప్తాను. వారలతో అధికప్రసంగము పెట్టుకోక భోజనము అయినవెంటనే వారిని పంపివేయండి. భోజనములోనైనా వారిపంక్తి వేరుగానుంచు టకు వీలయినంతవరకు చూడండి. ఏమో మనశక్తికొలది యొక రికి మేలే చేయవలయునుగదా!

(ఆనందభువన సమాజమువారు ప్రవేశింతురు.)

బసవ—(సమాజము వారితో) దయచేయండి. దయచేయండి. చాలా సంతోషమయినది ఎల్లప్పుడు యిల్లాగే దయయుంచి నాచునవి చిత్త గించుచుండవలెను. ఇదీగాక నేటి ప్రసాదము నుపేక్షించుట శ్రేయ స్కరము కాకపోవును.

మొదటి—ప్రసాదమునకేమిగాని, బసవరాజుగారూ! తమ బోటి స్నేహితులు నిజమయిన ప్రేమతో ఆహ్వానించినప్పుడు తప్పక రావ లసినదేగదా. ఏమండీ శాస్త్రుల్లుగారు! నిజమేనా?

పౌరా—(తనలో) ఇక ప్రతీమాటకు తలయూచుటయే. (ప్రకాశ ముగా) సందేహమేమి వాస్తవమే.

బసవ—మహారాజుగారు కూడ వేంచేసారు. (కామాక్షిని చూచి) పద పద. (వీధిగుమ్మమునొద్ద కామాక్షి మహారాజు పాదములపై పాలుచిలకరించి హారతియిచ్చును. బసవరాజు అతని చెయ్యిపట్టుకుని తెచ్చి యాసనముపై కూరుచుండపెట్టును. విద్యాధరుడు మహారాజు వెంటనే వచ్చును. వాడును ఆనందభువన సమాజమువారును సైగలు

చేసుకొని ముసిముసి నవ్వులు నవ్వుదురు.)

బసవ—(మహారాజు ముందఱ చేతులుజోడించి నిలువబడి) నేను తమ పాదధూళి నాయింట రాలినందున నేను ధన్యుడనైతిని.

మహా—దీనికి కారణము మీకు నాయందుగల అపరిమితమైన భక్తియే. భక్తిప్రేమచేతనే కదా శ్రీకృష్ణుడు పార్థునకు సారథి యైనది.

విద్యా—మరి విదురునియింటి నూకలకూడు సంతోసమున అంగీకరించుటకో?

రెండవగృహస్థు—(తనలోతాను) వేషము బహుబాగున్నది.

పౌరా—సరి బసవరాజుగారు! మహారాజుగారు యిచట చేయవలసిన పనులనేకములున్నవి. మొదట రేవతమ్మకు మంత్రోపదేశము కావలసియున్నది. కామాక్షమ్మగారూ! వారు వచ్చియున్నారా

చండిక—ఆహా రాకేమాన్నారా. ఇవ్వేళ బాగా పెందలకడలేచి యింటి పనులన్నీ చేసుకొని సరిగ్గా వేళకిక్కడ సిద్ధము.

పౌరా—అయితే ఆలస్యమెందుకు. రమ్మనండి వారిని. ఇవ్వేళ పదిఘడియలవరకే బాగావున్నది. (రేవతమ్మ ప్రవేశించును రామయ్య సంకల్పము చెప్పును. రేవతి మహారాజును పూజించును. పిదప మహారాజు ఆమెను తనచెంతకూరుచుండ పెట్టుకొనును. పౌరాణికుడు విద్యాధరుడు రామయ్య చుట్టూ తెరపట్టి వారిరువురను కమ్మి వేయుదురు. భక్తులందఱు భజనచేయుదురు. తెర తీసివేయబడును)

చండిక—కామాక్షమ్మా! ఇంక నీవున్నూ రేవతమ్మాకలిసి మహారాజుగారి వంటకొకె సంపెంగనూనెరాసి నలుగుపెట్టి స్నానము చేయించండి. ఆఁ అన్నట్టు మరచిపోయినాను. ఇక్కడ తీర్థంపట్టు పెట్టడము మఱచిపోయేరు సుమా.

(మహారాజు లేచిపోవుచుండ పద్మనాభుడు సోముడుబుజాన చేయియుంచి మెల్లగా మూలుగుతూ ప్రవేశించి మహారాజు పాదముల పైబడును. మహారాజు క్రిందికివంగి పద్మనాభుని సర్వాంగము మీద చేయిత్రిప్పి వానిని లేవనెత్తి)

మహా—నాభక్తుడు పద్మనాభుడు పాప మజ్ఞానమువలన దేహదండన మనుభవించుచుండెను.

పద్మనాభుడు—(చటాలునలేచి నిలువబడి ఆశ్చర్యముతో) ఇది కల గాదు. కథ (ఇటూ అటూ క్రిందామీదాచూచి) ఒక్కనాటికి కలకాదు. అయితే నేను మునుపటివాడనేనా? లేక యిది నాపునర్జ న్మమా! నేనుపడుచున్న ఆతీవ్రమైనబాధ అంతా ఏమయిపోయి నది. ఏమిటిది బాధయేమయినది?

పౌరా—మహారాజుగారు నీపైననుగ్రహించినందున నీబాధ నివృత్తి అయినది. అందుకునీకు చిత్తభ్రమ కలిగినది.

పద్మనా—మహారాజుగారూ! నేనీ ఋణమెట్లు తీర్పగలను.

మహా—ఓరీ! నీవు వెఱ్ఱివాడవు కావుగద! భక్తులు స్మరించి నంతటనే మేము పరుగిడి వచ్చుట కేవలము మాశిరముననున్న భక్తి ప్రేమ భారమును తగ్గించుకొనుటకే. ఒక భక్తి ప్రేమతప్ప మేము దేనినీ కోరము.

రామయ్య—ఏమిరా! నీ విన్ని దినాలుగా బాధపడుచుంటివే. ఇవ్వేళ నీకు తెలివివచ్చినది.

పౌరా—ఇన్ని దినాలవరకు వాడి నష్టచర్యతీరకుండెను. అంతే.

పద్మనా—అదే నిజము. ఈ సంసారచక్రములో పడిపోయి మహా రాజుగారి పాదము లింతదగ్గరలోనే వుండియు వృధాగా కాశీరామే శ్వరయాత్రలుచేస్తూ కూర్చున్నాను. మహారాజా! ఇక నన్ను

పాపవిముక్తునిగా చేసి ఈ జన్మాంతమువరకు తమపాదసేవ ఘటించు నట్లాశీర్వదింపవలయునని వేడుకొనుచున్నాను.

సీ. ఓయి! గురురాయ! మాకు నీ వొసగుమయ్య
భవ్యతరమగు నీపాద పద్మసేవ,
వలదు వలవదు మా కల్ల వ్యర్థములగు
దేవతాదర్శనమ్మును తీర్థసేవ;
నీదుసేవయె ఘటియించు నిశ్చయముగ
నిహపరసుఖంబు లన్నియు సిద్ధచరిత !

మహా—పద్మనాభా! తొలుత నిను పాపవిముక్తుని గావించి తరువాత నే వ్యాధివిముక్తుని చేసితిని. తెలిసినదా ?

రామయ్య—ఇపుడా నాస్తికులు ఎక్కడున్నారు? వాళ్లను చూడ మనండి.

విద్యా—ఈ జరిగినవింత వారలుచూచియే యుందురు.

చండిక—చూచితివా, కామాక్షమ్మా! మనము దేముడు దేము డంటాముగాని ఈ పనులా దేవుడిచేతవుతాయా ? ఎమన్నా ఆరాళ్ల రప్పల దేవుళ్లెక్కడ? మన మహారాజుగారెక్కడ?

మహా—ఇది మా అవతారములోని కృతి. ఏమనగా దేవతలు తమ తమ పనులను పంచుకొనినప్పుడు కష్టసాధ్యమైనపని మా వంతునకు వచ్చినది. మోహవశులయి గ్రుడ్డివారివలె తిరుగుచున్న పాపాత్ము లకు సులువుగా పుణ్యమబ్బచేయుటకు వారలకు దివ్యదృష్టినిచ్చి వారిని తరింపచేయుటకు మేమొప్పుకొన్నారము. మంచిది. పద్మ నాభుడా ! ఇక మా పంక్తిలో కూర్చుని యథేచ్ఛగా భోజనము కానిమ్ము. ఇక నీ కేచావుసంభవింపదు.

పద్మ—కుత్తుకలోని కొక కబళమైన దిగదుగాని దేవరవారి యాజ్ఞ

ప్రకారముగా నడుచుకొంటాను.

(బసవరాజు చేయిపట్టుకొని మహారాజు నిష్క్రమించును)

పౌరా—ఊం మహారాజుగారి స్నానముకానసమయంలోనే విస్తళ్లువేయడమే. పదండి.

(పౌరాణికుడు పద్మనాభుడు తక్క అందఱు నిష్క్రమింతురు)

పద్మ—ఏం శాస్త్రిగారు! (పెద్దనవ్వు నవ్వుచు) బాగా రక్తికట్టిందా లేదా?

పౌరా—ఆఁ కట్టిందే అనవచ్చు. కాని దీని మంపతెగా నాకెంతో భయంగాఉంది అనుకున్నావు!

పద్మ—ఎందుకయ్యా! భయమెందుకు?

పౌరా—భయమనగా ఒకవిధమయిన భయమూ ఈదౌర్భాగ్యాలంతా యిక్కడ పోగుకావడము. నీకుచెప్పినపాఠం సరిగ్గా గట్టిగావచ్చినదో లేదో? లేక మహారాజుగారి పాదాలమీద తిరాతలపెట్టి లేనిపోని మాట లేమికూస్తావో, చివరకంతయు సభాసయి కంఠానికురి మొక్కడనస్తుందోనని మొక్కోరుగా గుండెలు దడదడలాడుతూనే ఉన్నాయి.

పద్మ—ఇప్పటికి బాగా గడిచిపోయిందిగద. ఇక మహారాజుగారి పంక్తికి వెళ్లి దిట్టంగా పట్టిస్తాను. రెండుదినములనుంచి తిండిలేదు.

పౌరా—అన్నట్లు నీకు పథ్యముండెను గదా.

పద్మ—పాపం కామాక్షమ్మ ఎన్నిపదార్థాలోవండి వడ్డించేది గాని మీమాటను మీాఱి ఏదైనాతప్పితే యేమికీడు మూడునో అన్న భయానికి నోరు కట్టివేసుకునే వాడను.

పౌరా—సరే నడువు. ఎవరన్నా మనమాటలు వినేరు.

తృతీయాంకము సంపూర్ణము.

# చతుర్థాంకము

## ప్రథమరంగము

స్థలము—ఆనందభువనము

(విద్యాధరుడు నితరసభ్యులు ప్రవేశము)

మొదటిగృహస్థు—ఎంతసేపటినుండియో మీ కొఱ కెదురుచూచుచున్నా ము. ఈనాడు మీరు వచ్చుట కింత ఆలస్యమయిన దేమి ?

విద్యా—నిన్న జరిగినకథ నా కేమాత్రము యిష్టముగా లేదు. నే నదిచూడలేకపోయినాను. అందుచేత బసవరాజుగారియింటికి వెళ్లి యింకొకసారి యతనిని మందలించి వచ్చినాను.

రెం-గృ—ఏమయినా తెలివి వచ్చినదా అతనికి మరి ?

విద్యా—ఎక్కడి తెలివి

గీ. ఘనులు వచియించునీతివాక్యములు చేదు
దాంభికులకుమ్కు మధుర మాంతనికి నిజము
సుధను త్యజియించి గ్రహియించె సుర నతండు
బ్రహ్మ యేమిలిఖించెనో వానినొసట.

ఈ జరిగినదంతా వారితో చెప్పకపోయిన జాలును. అట్లు చెప్పవలదని యతనితో సూచించినాను కూడాను. ఏమిచేయునో చూడవలయును.

మొ-గృ—ఇంక ఇప్పటికి మీరు నతానికి దూరమైనా రన్నమాటే.

విద్యా—ఆఁ ; అంతేమాటే. మనపనికూడా అయిన దన్నమాటేగా. అనాయాసముగానే నిన్నటిసందర్భము మీరందఱు చూడగలిగి నారు. అంతయు కల్పనాతీతముగా నుండెను.

మొ-గృ—వాస్తవముగా కల్పనాతీతము. ఆప్రసాద మేమిటి?
విద్యా—ప్రసాద మేమిటి, తీర్థమేమిటి, ఆజరిగినవ్యవహార మేమిటి!
మూ-గృ—ఆతీర్థపుసంగతి యేమిటండోయి ఇంకాను?
విద్యా—మరి మీ రచట చూచిన దేమిటి, భోజనాలకు కూర్చునే ముందు ఆపౌరాణికుడు యేనీళ్లో తెచ్చి అందఱిచేతులలోను పొయ్యలేదా?
మొ-గృ—మనము అప్పటికి పోయి కూర్చుండలే దనుకుంటాను.
మూ-గృ—నేనుమాత్ర మది పుచ్చుకున్నాను సుమండీ. అది గంగాజల మనుకున్నాను.
విద్యా—అది మహారాజుగారు స్నానమాడినజలము గంగాజల మేమిటి? నిన్న బసవరాజగారింట జరిగినది కాశీసమారాధన కాదు.
(అందఱు నసహ్యమునటింతురు)
రెం-గృ—(శివ గృహస్థుతో)ఇపుడుముఖము చిట్లించుకొన్న లాభ మేమి?
విద్యా—మరి వాడామహారాజునోటబెట్టుకొని ఉమ్మినయెంగిలి అంతా ప్రసాదము ప్రసాద మని యచటకూడిన తెలివిహీను లంతా స్వీకరించినది మీరు చూడనే చూచినారు గదా!
రెం-గృ—అది చూచినాము. (మూ-గృ-తో) ఏమండోయి తీర్థముతో పాటు తమరు ప్రసాదముకూడా గ్రహించారా యేమిటి?
మూ-గృ—ఇక మీ రేమన్నా సరే తీర్థము పుచ్చుకోడము పొరపాటు నావల్ల జరిగినవి.
విద్యా—జరిగిన దేమో జరిగినది. ఇంక ముందు జరుగవలసిన దేమిటి?
మొ-గృ—అగును. ముందేమిచేయవలసినదీ ఆలోచించవలసియున్నది. మంచిమాటలతో యీ ఆటలాగిపోవునా!
విద్యా—ఆగవుగాని తోలుత నామార్గమవలంబించుటయే మేలు.

రెం-గృహ—అనగా మనమందఱము నా శాసనకోసుకుల వాదముల మీద పడవలయుననియా మీ అభిప్రాయము. నన్నడిగితే వా ళ్లందఱినీ మొదట కోర్టుకీడవాలి.

విద్యా—కోర్టుకీడ్చిన వారుచేసినయపరాధము మనమేమిచూపగలము.

మూ-గృ—అయితే యింకనూ కొందఱిని దోచుకొనినపిదపనా యే దయినా చేయవలసినపని.

విద్యా—నేడేమి చెప్పుటకు వీలులేదుగాని తొందరపడి చేసిన కార్యము చెడిపోవును అన్నమాట మనము మరువకూడదు.

మొ-గృ—అయితే మొదటమనము మఠానికివెళ్లి ఆ మోసగాళ్లతో రెండుమంచిమాటలాడి ఇంకమీ నాటకమింతతో కట్టిపెట్టి ఈ యూరువదలి యేవల్లకాటిలోనో పడిచావమని చెప్పడమేగద. ఇంతేనా మీరనేది, బాగానేఉన్నది. అట్లే చేయుదమురండు. ఈ మహాత్కార్యము వీలయినంత త్వరలోమాత్రము చేయవలయును. సమయమెప్పుడో చెప్పండి.

విద్యా—ప్రతిరోజూ సాయంకాలము హారతి యెత్తునపుడు వాడిశిష్యు లందఱూ మఠములో గూడుచుందురు.. రేపాసమయములో మీ పురాణము విప్పండి. శిష్యుడనని చెల్లినంతకాలము చెల్లనిచ్చె దను. అవసరమయినపుడు నా నిజస్వరూపమును దాల్చి మీకు సాయముచేసెదను.

మొ-గృ—ఇంతవరకునిశ్చయమయినది.ఇంక వాడిశిష్యురాలుమీనాక్షి—

రెం-గృ—(మూ-గృ-తో) దానిసంగతేమిటి?

మూ-గృ—ఔనండోయి. ఆసంగతి యింకా చెప్పనేలేదు. పాపము మహారాజు మహారాజని తను లోకుల నిదివరకు దోచిసంపాదించిన యాస్తియేవత్తు వాడికర్పించి వేసినది. అప్పటికినీ మహారాజు సం తృప్తిచెందక మీనాక్షి మంచిచక్కదనము గలదిగనుక—

మొ-గృ—సరి తెలిసినది. మోహావేశులై రారన్నమాట. పిదప?

మూ-గృ—పిదపనేమున్నది. నెత్తికిచేతులు—ద్రవ్యమపహరించి మోక్షముపొందుటకు చూపినమార్గమిట్టిది—దానిదాసీది—దాని పేరు నాగికాబోలు. మహారాజును అడ్డమయినతిట్లు తిట్టుచూ ఊరంతా చాటిస్తున్నదట.

రెం-గృ—మీరామఠములోనున్న మనిషిని వశపరుచుకొన్నారట వాడివల్లనే మీకిదంతా తెలిసియుండవచ్చును.

మూ-గృ—ఎవరివల్లనో యొకరివల్ల తెలిసినది. నేను చేయవలసినపని నేను చేసినాను.

మొ-గృ—ఈ భోగముసాని మంచిమంచి మొనగాళ్లనెందఱినో దోచుకుని చిప్పచేతికిచ్చింది. దీనిని దోచుకున్న యీమహారాజెవఱో గాని దొంగలకు గురువల్లే ఉన్నాడు.

విద్యా—గాడిదను కుక్కనాకితే, కుక్కకువెలియూ గాడిదకు దోషమూ అన్న శుష్కశాస్త్రార్థమువలెనే యున్నది మనప్రసంగము. ఈసంగతి తెలుపుటయే మేలయినది. సరి రేపుసరిగా మనమనుకొన్నవేళకు మఠానికిరండి. ఎంతటిచిత్రచిత్రాలు జరుగుతాయో చూతము. (అందఱు నిష్క్రమింతురు)

## ద్వితీయరంగము

స్థలము—బసవరాజుగారి గృహము

(బసవరాజు కామాక్షి మాట్లాడుచుందురు)

కామా—నాభక్తులందరిలోనూ చండికమ్మ మంచి యోగ్యురాలని మహారాజుగారు యెప్పుడు ననుచుందురు. అది నిజమే వఠిమాటేనా? ఆవిడ సంగతిచూస్తే—

గీ. పరుల కుపకారమును జేయు పవలు రేయి
లేశమేనియు లోభంబు లేదు మదిని
తనదుశిరమున నాతపమ్మును ధరించి
నీడ ప్రజల కొసగునవనీజ మామె.

బసవ—బహుశ్రుతత్వమువలన నామెకట్టి జ్ఞానము కలిగినది.

కామా—మహారాజుగారికి ముత్యాలహారము యిచ్చినప్పుడు మీరేమని పోతారో అని హడిలిపోయినాను. అప్పుడు చండికమ్మ నాకెంతో ధైర్యము చెప్పింది. నిన్నెవ్వరు నేమియుననరు. మహారాజుగారికేమీతక్కువలేదు. మీలాంటి పేదవాళ్లసొమ్ము అట్టే పెట్టుకోరు. లేనిపోని భయము పెట్టుకోకు అని అన్నది.

బసవ—నిజమే అష్టసిద్ధులు నాయన చేతిలోనున్నవి. ఆయనకేమి తక్కువ.

కామా—చండికమ్మా ఆమాటే అంటుంది. ఆవిడనేది యేమిటంటే అవియన్నియు ఆయనలీలలు. ఆయన చేతిగుణం చూతురుగాని, అని, అల్లాగే మర్నాడు హారతియిచ్చేటప్పుడు చూస్తే మొదటి కంటె యెక్కువ చకచకలాడుతూంది.

బసవ—మొదటికంటె మెరుగెక్కువా?

కామా—ఒక ముత్యాలహారానికేనా. మనయొద్దనుంచి పట్టుకుని వెళ్లిన నగలకన్నింటికి మెరుగెక్కువఅయినది. మహారాజుగారి చేతిగుణం.

(చండికమ్మ ప్రవేశించును)

కామా—అదిగో ఆమెరానేవచ్చింది. నూరేళ్లాయుస్సు.

చండి—ఎందుకులెస్తూ. నాలాంటి దురదృష్టవంతురాలికి నూరేళ్లు రెండువందలయేళ్లూ ఆయుస్సు.

బసవ—ఇక ఆమెతో మాట్లాడుతూ కూర్చో నాకు పనియున్నది వెళ్లి వస్తాను. (నిష్క్రమించును)

(చండికమ్మ యొక్కనిట్టూర్పు విడిచి కూర్చుండును)

కామా—ఇవ్వేళ యెందుచేతనో మీముఖము వాడినట్లుంది. వంట్లో కులాసాగా ఉందా ?

చండి—నాకేంరోగము. నాకయ్యేదంతా వకమాటేఅయింది. నాలు కాలాలుపాటు బ్రతుకదలచినవాళ్లని దేవుడు వెదకి తీసుకువెళ్లు తాడు నాలాంటి వాళ్లను మఱచిపోతాడు. (కొంగుతో కన్నీరద్దు కొనును)

కామా—వద్దమ్మా పిన్నీ ! ఇట్లా వాగాయత్తపు మాటలాడకండి. మీమట్టుకు మీరేమనుకున్నా మాలాంటి వాళ్లము అట్లాఅను కోము. మీరేయింత తెగతెంపులు చేసుకుంటే మాలాంటి వాళ్లము యెట్లా బ్రతకడము. అయినా యిప్పుడేమంత వచ్చింది. మహారాజుగారు కులాసాగా ఉన్నారా ?

చండి—నేను చావుకోసము వెతుక్కుంటే, అదియెక్కడికి పోయిందో గదా ! ప్రాణము విసికిపోయింది తల్లీ ! దేవుడా ! తండ్రీ ! నాబాధ లెప్పుడు తీరుస్తావు నాయనా ?

కామా—అయ్యో ! వద్దుపిన్నీ ! మిమ్మల్ని నేనెట్లా ఓదార్చనమ్మా ?

చండి—ఇక ఓదార్చడములేదు. గీదార్చడములేదు. ఇట్లాగే ప్రాణాలు వదిలేద్దా మనిపిస్తూంది.

కామా—మఠములో బందిపోటుపడి అంతా దోచుకువెళ్లినారా ? యేమిటి ? వెడితేవెళ్లనీ, మహారాజుగారి ప్రాణాలు చల్లగాఉంటే అంతేచాలు.

చండి—అయ్యో. పై టపాంగ లెందుకమ్మా. ఇంటిగుట్టెరిగిన ముండా కొడుకులే. చచ్చినవాళ్లు నమ్మించి గొంతుకకోసినారు. వాళ్ల బూటకాలు తెగులుబడిపోనూ. మరియొకరి మాటైతే నాకు అంత అనిపించికపోవును.

కామా—పురాణం చెప్పేఆయన యేమయినా చేసినాడాయేమిటి?

చండి—అబ్బే లేదమ్మా. ఆయన దేవుళ్లాంటివాడు. ఏవల్లకాట్లో వాడైతేనేమి. నీమెడ యిరికించినాడు. ఇంకేముంది. నిజంచెప్పనా? నాకు బసవరాజుగారికోసం కూడ యేమీ అనిపించడములేదు. అతనిదేమిటిపాపము. ఊరుపొమ్మంటున్నది. కాడురమ్మంటున్నది.

కామా—ఏమిటి యీ మాటలు. నాకేమీ అర్థంకావడములేదు.

చండి—ఏచిక్కూలేకుండా దేవుడు కళ్లువిప్పి చూసినాడుగాదు. కాని అతనుమాత్రము తీరికూర్చుని మళ్లీఅంతా తనచేతులారా తెచ్చిపెట్టుకున్నాడు. మూడవది దాటిపోగానే సన్యాసంపుచ్చుకుని యేకాశీలోనో రామాకృష్ణా! అంటూ కూర్చోక, నీగొంతుకకురిపెట్టవలసియున్నది గనకనే నాల్గోపెళ్లి చేసుకున్నాడు.

కామా—ఇదిగో పిన్నీ! ఏదైనా అదృష్టాన్నిబట్టి ఉంటుంది. నాకేమి తక్కువ. కాకపోతే యీడుకాస్త యెక్కువేగాని . ఈ ఈడులో సంసారాలు చేసినవాళ్లు చెస్తున్నవాళ్లు ఎందరున్నారుగారు. ఇప్పుడామాట లెందుకు?

చండి—మరి నానెత్తురంతా నీరైందెందుకనుకున్నావు. చూసేవాళ్లకు పైకి నీసంగతంతా చక్కగానే ఉందిగాని, నీకిప్పుడు మంచి వయస్సు. ఇంకా నీబ్రతుకంతా గడవవలసియేయున్నది. ఒకవేళ ఖర్మంకాలితే నీగతేమిగాను. నీకు దిక్కెవ్వరాఅని నాగుండెలవిసి పోతున్నాయి. పొద్దుటినుంచీ యేమీ తోచడములేదు.

కామా—ఖర్మమేమిటి? కాలడమేమిటి? నాకేమీ తెలియడములేదు
[పిన్నీ!

సీ. నాభర్తకును ప్రేమ నామీద కడుహెచ్చు
ముద్దుసేయు నతండు తద్దనన్ను
ధనధాన్యలోపంబు కనుపడ చింతయు
పాడియు నున్నది వలసినంత
సేవకు లుండిరి చెప్పినపనిచేయ
దాసీజనంబు నిత్యంబు నుంద్రు
దేవతార్చన లింట తృప్తిగాజరుగును
గురుపాదభక్తికి కొదువలేదు

గీ. మాకొలము నుద్ధరించుకొమారునొకని
బడసి నాగర్భమునయందు కడకు నాదు
భర్తతోగూడ పొందెద భవ్యపదము
లోపమేమిటినా కిహలోకమునను.

అదియునుగాక నాకు బోలెడు నగలున్నవి. అవి యన్నియు నాచెంత నున్నవిగదా!

చండి—అదుగో అదేగదా నాకిప్పుడు వచ్చినకష్టము. ఇంకనీకు చెప్పక విధిలేదు.

కామా—ఏమిటిపిన్నీ! మీరిప్పుడు చెప్పబోయే దేమిటి?

చండి—నీనగలసంగతే, ఆచచ్చినాడన్నీ మింగేశాడు.

(తెరలో బసవరాజు శ్యామలను పిలచును)

చూడు బసవరాజుగారు నిన్నెందుకో పిలుస్తున్నారు. లోపలికిపద. నేనువచ్చి అంతా చెబుతాను. నీవేమీ భయపడకు. నేనున్నానుగా!

* (ఇద్దఱు నిష్క్రమింతురు)

## తృతీయరంగము

స్థలము కుంజపురమఠము

(విద్యాధరుడు ; మీనాక్షి మాటలాడుచుందురు.)

విద్యా—పొట్టతిప్పలెవరు తప్పించుకోఁగలిగినారే? శరీరవిక్రయమేగాని వేరువ్యవసాయమేదియు నీకు చేతకాకపోయెనా? అవసరమైన పుడేకూలిపనినైన చేసి పొట్టపోసికొనియున్నచో నీశరీరముమనస్సు పరిశుద్ధముగా నుండియుండును గదా!

మీనా—అదంతా సత్యమే యవ్వనమదముచే దుస్సాంగత్యమునకు లోఁబడి నాజన్మము మట్టిపాలుచేసి కొంటిని. ఈజన్మమే యన నేల. జన్మజన్మములకు నరకము పాలుచేసికొంటిని. నా బోటివారి నుదుట వ్రాసినదే యింత. ఇందులోఁగల పరాభవము మాకేగాని యితరులకు తెలియదు. అయ్యో! నిజముగా దీనికంటె నరకమే మేలు.

విద్యా—ఇప్పటికైనా నిజముగా కనులు విప్పితివా! లేక త్రాగుబోతు వాని పశ్చాత్తాపమా!

మీనా—ఏమని మనవిచెయ్యను. నేటివరకు దీనిలో పొర్లాడినదాన నేగాని యింతటినుంచి యైనను విముక్తురాలను కాదలచి నాయావ దాస్తి—

విద్యా—పుణ్యానికి పోతే పాపమెదురు వచ్చింది. ద్రవ్యమర్పించిన మాత్రాన పాపులుపరిశుద్ధులయ్యె యెడల ధనమదాంధు లెందఱు తా మొనర్చిన ఘోరపాతకమును డబ్[illegible]న సహాయమున కప్పువడిన పాతకములు క్రొ[illegible]గియుండి

క్రమక్రమముగా లోపల రగిలి రగిలి యొకనాటి కుగ్రముగా ప్రజ్వలింపకమానవు. సత్పాత్రలకు దానముచేసి మాత్రము వాటితీవ్రత కొంత తగ్గింపవచ్చును. నీ ద్రవ్యము దానమే చేయబడెనా? సత్పాత్రలకేనా? నీచనీచులకు దానముచేయుటవలన పాపవిముక్తురాలవు కాలేదుగాని వారుచేయు పాపాచరణమునకు సహాయముచేసిన దానవై, వారొనరించు పాపకృత్యముల భారము కూడా కొంత నీ తలపై దెచ్చిపెట్టుకుంటివి.

మీనా—చెట్టు చెడేకాలానికి కుక్కమూతి పిందెలు. నేను చెడేకాలానికి చెడుబుద్ధిపుట్టింది. అయితే వీరినాశ్రయించినవాళ్ల అందరిగతీ యింతేనాండీ?

విద్యా—నిజమైనసద్భావముతో వీరి నాశ్రయించిన బసవరాజువంటి తెలివివిహీనులు తక్కువేగాని తక్కినవారు ఏదో డబ్బాశ మరెదో ఆశ మరెదో ఆశపెట్టికొని వీరిని చేరినవారే. పాపము స్త్రీలుమాత్రము వీరిమోసముచేత అన్నివిధముల పాడుఅగుచున్నారు.

మీనా—మొత్తానికి మే మెక్కడికివెళ్లినా మా తలవ్రాతయింతే.

విద్యా—కారణము మీ బేలతనము. ఈడుతోబాటు మీశరీరము పెరుగునుగాని బుద్ధిమాత్రము పెరుగదు. బుద్ధియెట్లు వృద్ధిపొందకలదు? విద్యయనెడు సానరాతిమీద నది నూరబడియుండలేదు. మంచి చెడుగులాలోచింపక యొకరి ననుసరించి యొకరు వారిననుసరించి మరియొకరు యిట్లు యెటుతోసుకొనిపోయిన నటుతోసుకుని పోదురు. ఈ ప్రకారముగా గ్రుడ్డివారొకరొకరికి మార్గదర్శకులయినందుచేతనే మీరు వీరికిలోబడితిరి. మోక్షమనగా యేమిటో, అదియెట్లుండునో యెట్లు సంప్రాప్తమగునో మీ రెవ్వరయినా గ్రహించినారా? గ్రహించినను ఈ మోసగాండ్రు మీకు స్వర్గ

ము నెట్లివ్వగలరో యేమయినా ఆలోచించినారా? మనమాచరించు సత్కర్మలచే మన మనస్సునకు సంభవించు శాంతియే మోక్షస్థితి. దుష్కార్యాచరణవలన సంభవించు యాతన నరకము ఈ రెంటినీ మనమీలోకమందే యీ జన్మయందే చూతుము. అనుభవింతుము. ఈ రీతిగా మనకర్మ ననుసరించి ప్రాప్తించు స్థితులను పరులెట్లు మార్చగలరు? ఇప్పుడైనా తెలివి వచ్చినదా?

మీనా—అయ్యా! బాగావచ్చినది తెలివి.

గీ. ఉత్తమకులమున జనన మొంది యేను
చేసికొంటిని మలినంబు జీవితంబు
నిహపరమ్ముల లిఖియించె నేని. బ్రహ్మ
యధమగతి నాకు కావింతు నాత్మహత్య.

విద్యా—అనగా యిదివరకుచేసిన పాపము చాలకనా, ఆత్మహత్యతో దానిని పూర్తిచేసికొనుట.

మీనా—ఔను. అదియు చెరుపే మరియింక నేనేమిచేయను. వద్దు నాకా నగలువద్దు యేమీవద్దు. ఏ పుణ్యస్థలమునకో పోయి రామనామస్మరణచేస్తూ కూర్చుంటాను ఈ జానెడుపొట్ట బిక్షమెత్తుకొనియో కూలిచేసికొనియో నింపుకోవచ్చును. అయితే, అయ్యా! నాకింక సద్గతిదొరుకునా?

విద్యా—నిరాశ జెందకుము. ఎట్టిపాపము నెఱుగని జనుడీలోకమున గలడా? ప్రతిమనుజుడునూ పాపమాచరించుచునే యుండును. కాని తానొనరించునది పాపమని తెలిసినవెంటనే దానిని విసర్జింపవలెను. పశ్చాత్తాపమే పరిశుద్ధికి మూలము సరే నీ వింకపొమ్ము. నీ నగలను గురించి యేమిచేయవలసియుండునో పిమ్మట చెప్పెదను.

(మీనాక్షి నమస్కరించి నిష్క్రమించును)

విద్యా—(స్వగతము) మాటలసందడిని పూజాపాత్రలు బాగ తోమ లేదు. పంచ కుచ్చెళ్లుపెట్టడమే మరచిపోయినాను. (దోవతులకు కుచ్చెళ్లుపెట్టుట మొదలుపెట్టును) (చక్రధరుడు ప్రవేశించును)

చక్ర—ఇదేమిటండోయి యీపనికూడా మీరు చేయవలెనా?

విద్యా—సేవాధర్మము. అయితే మహారాజుగారి పాదముల కభిషేకము జరుగుచున్నదిగద.

చక్ర—జరుగుచున్నది. అదే చూస్తూ నిలబడియుంటిని. అయితే పౌరాణికుడు మీరు చెప్పినట్లు నన్నే చూస్తూ ఉండెను. వాడు నన్ను పోల్చలేదుగద.

విద్యా—చెప్పజాలను. వాడు అతి ధూర్తుడు. ఎవరువచ్చేది, యెపుడు వచ్చేది, కనిపెట్టుచుండును. అయినా మీ వేషం చాలా బాగా ఉందండి.

చక్ర—ఏమండీ! ఈవైదిక బ్రాహ్మణులకు పిచ్చిపట్టలేదుగద. వారిలో బాగా చదువుకున్నవారుకూడా ఉన్నారండీ.

విద్యా—ఆ. పిచ్చిగాక మరేమిటి. అయితే అది డబ్బుపిచ్చి యజమానిచెయ్యి కాస్తవదులుగా ఉంటే యీపిచ్చ ముదిరిపోతూంటుంది. అప్పుడు యేపనిచేయుటకు సంశయించరు. ఈపిచ్చివలన నెందరో ధనికులయినారు.

చక్ర—ఔనుమరి. ధనికులగుటకు మార్గము అవదానమో లేక కుదానమో గదా!

విద్యా—ఇంక యీకథ ముగింతము.

చక్ర—ఇంకా కొన్ని ఆహ్నికాలు మిగిలియున్నట్లున్నది.

విద్యా—ఔను. ముందు మహారాజుగారికి అభ్యంగనస్నానప్రయత్నము చేయవలసి యున్నది.

చక్ర—అయితే ఆమె నగలమాట యేమిటి.

విద్యా—ఇంతకుముందే ఆమెవచ్చి వెళ్లినది. కొంచెము ముందువచ్చి యుంటే మీరామెను చూచియుందురు. ఆమె నగలు సురక్షితము గానే యున్నవి.

చక్ర—అనగా ?

విద్యా—అనగా యేమిటి. మహారాజుగారి ద్రవ్యభాండారమంతయు ప్రస్తుతము వారి విశ్వాసమును పూర్తిగా సంపాదించిన యీప్రియ శిష్యుని స్వాధీనములో నున్నది. చేసిన సేవ ఫలింపకపోలేదు.

చక్ర—సెబాస్ ! వాస్తవముగా మీరు మాపని చాలావరకు సార్థకము చేసియున్నారు. ఇక మేమూరికే నామకార్థముమట్టుకు ముందుకు రావలసిన వారమే. అయితే భాండారమంతయు మీ స్వాధీనములోనా యున్నది ?

విద్యా—అవునుగాని బసవరాజుగారి వస్తువులకుమాత్రము కాళ్లువచ్చి చాలామట్టుకు అవి పౌరాణికునింటిలో ప్రవేశించినవి. సంగతు లన్నియు మీకు క్రమక్రమముగా తెలిపెదను. నేను పోవలసి యున్నది. సాయంకాలమున నదియొడ్డున తిరిగి కలసికొని చెప్పవల సిన విషయములున్న చెప్పెదను.

చక్ర—చిత్తము. మీరిక పొండు. నేనునూ వెళ్లెదను.

(ఇరువురు చెఱియొకప్రక్కకు నిష్క్రమింతురు)

---

## చతుర్థరంగము

### కుంజపురమునందలి మఠమ్ము

(మహారాజునకు ధూపహారతిముగిసి, యతనిముందు దీపారాధ నలు వెలుగుచుండును. పౌరాణికుడు; బసవరాజు; రామయ్య; విద్యా

ధరుడు; పద్మనాభుడు; మహారాజునకు కుడిప్రక్కను చండిక; అంబిక; రేవతి మొదలగు స్త్రీలు యెడమప్రక్కను నిలువబడి యుందురు. ఆనంద భువనసమాజమువారు అమర్యాదగా నిటునటు తిరుగుచుందురు)

పౌరా—(ఆనందభువనమువారితో) మీరు మంచి విద్యాసంపన్నులు, బుద్ధిమంతు లనిపించుకుంటున్నారు. కాని మీచేష్టలు నిరంకుశముగా నుంటున్నవి. మట్టుమర్యాద లెఱుంగక ప్రవర్తించుచున్నారు. ఇది మీకుతగదు. భక్తులయెదుట మహారాజుగారి నగౌరవపరచుచున్నారు. దీని ఫలితమేమగునో బాగా ఆలోచించుకొనుడు.

విద్యా—మీరెచట మాటలాడుచున్నది యెవరితో మాటలాడుచున్నది బాగుగా గుర్తెఱిగి మాటలాడండి.

పౌరా—నేననేది అదే. ఇదిగాక

"నబుద్ధిభేదం జనయేత్ అజ్ఞానాం కర్మసంగినాం
జోషయేత్ సర్వకర్మాణి విద్వాన్ యుక్త స్సమాచరన్"*

అని సాక్షాత్తుగా శ్రీమద్భగవద్గీతా వాక్యమే ఘోషించుచున్నది. ఏమనగా, అయ్యా ఎవరైనను నొక సత్కర్మ చేయుచుండగా వాని మనస్సేదయితే కలదో ఆమనస్సునందు ఏమన్నారంటే 'నబుద్ధిభేదం జనయేత్' అనగా నేమిటి అశ్రద్ధపుట్టించి వానిని ఆసత్కర్మ నుండి తొలగించకూడదుట.

విద్యా—అంతేకాదు 'జోషయేత్ సర్మకర్మాణి' అని కూడ చెప్పియున్నది. మనమే దానినంగీకరించి వృద్ధిపఱుపవలెను. శాస్త్రులవారు సెలవిచ్చినది బోధపడినదా?

పౌరా—శాస్త్రులవారు సెలవిచ్చినదేమిటి? ప్రత్యక్షముగా భగవంతుడే అర్జునునికి బోధించినది. మీరు శ్రద్ధగలవారు కాకపోతే మానె

యితరులకు విఘ్నము కలిగించి పాతకమెందుల కొడికట్టుకుంటారు?
రెం-గృ—సత్కర్మ చేయుచుండిన గదా ?
విద్యా—సత్కర్మో దుష్కర్మో మీరే ఆలోచించుకోండి.
మూ-గృ—అయితే అమాయికులగు స్త్రీలను, బసవరాజుగారివంటి తెలివిహీనులను వలలో వేసుకొని,......
బసవ—శివశివా! ఏమి యీ అనాచారము. మీరిట్లు పెడదారి ద్రొక్కుచున్నారేల ?
మూ-గృ—వీరిబోటి పిచ్చిబాపలకు లేనిపోని యాశలుకల్పించి వారిని మీరు పెడదారిలో పడవేయుచుండ, చూచుచూ మేమూరికే నిశ్చింతగా కూరుచుండవలెనా ?
మహారాజు—ఇట్టి సమయములయందు శాంతవృత్తినే యవలంబింపవలయును.

గీ. అక్షయసుఖంబునకు తల్లి యగును శాంతి;
యందు నిజముగ నున్న దత్యంతప్రీతి
కాన నజ్ఞులశాసించు కార్యమునకు
దానియారాధన మె యుక్తమైనకర్మ.

మొ-గృ—(తమ సమాజమువారితో) తెలిసినదా ? అజ్ఞులు; అజ్ఞులు అని గౌరవించేది మనలనే. (మహారాజుతో) ఈశాస్త్రిగారే ఊరుకోలేక లేనిపోని ప్రసంగము యెత్తినారు. మేము కించిత్తయినా అధికప్రసంగము చేయలేదు. మేము తమ కృపాప్రసాదమునకై వేచియున్నాము. అది దయచేయించినచో మేము కృతార్థుల మయ్యెదము.
మహా—(తనలో) శాస్త్రిమీదనుండి తుట్ట నామీద పడవైచుకొన్నాను.
మొ-గృ—ఇదిగో మానోళ్లు మూయించుటకు శాస్త్రిగారు తమకను

కూలమైన వాక్యమును యేభగవద్గీతనుండి వక్కాణించిరో అదే గ్రంథములో "భగవంతుడా! నేను నీభక్తుడను జ్ఞానామృతము నాచేత త్రావించి నాకు దివ్యదృష్టి ప్రసాదింపుము" అని అర్జునుడు శ్రీకృష్ణుని కోరినాడు. వెంటనే......

అందరు—శ్రీకృష్ణు డర్జునునికి దివ్యదృష్టి ప్రసాదించినాడు.

మూ-గృ—మహారాజుగారూ! ప్రస్తుతము మేమందరము అర్జునులము మీరు శ్రీకృష్ణులు అనుకుందాము.

రెం-గృ—కాస్తసేపేమిటి! ప్రస్తుతమేమిటి! వారు కేవలముగా ఈశ్వరావతారులే! అడగండి పౌరాణికులుగారిని. ఏమండీ!

మూ-గృ—తస్మాత్ మామీద దయగలిగినవారై తమజ్ఞానసూర్యుని యేసన్నని కిరణములైనా ప్రసరింపజేసి మాగాఢమైన యజ్ఞాన తిమిరమును నశింపజేయండి.

రెం-గృ—మహారాజుగారూ! నేడు మొదట యోగశాస్త్రముమీద ఉపన్యాసము నివ్వండి.

మహా—(కోపముతో) అనఘా! మీరు నన్నాజ్ఞాపించుచున్నారా యేమి? మీకు యీసంగతులు తెలుసుకునే అంతటి అధికారము కలదని మాకు తెలిసినపిదప మాకిష్టమయితే రెండు మాటలు చెప్పెదము. ఇష్టముగాకున్న మానెదము.

రెం-గృ—మాకాశుష్కయోగము మాత్రమక్కరలేదు. ఈ గడ్డములు మీసములు బారెడేసి పెంచవలసి వస్తుంది. ఏ నిర్జనారణ్యములోనో యేకొండ గుహలోనో పాతుకుని కూర్చుండవలసి యుంటుంది.

మొ-గృ—అచట వేళ్లు మూలములు ఆకులు అలములు తప్ప తినుట కేమియు దొరకవు. ఎంతకష్టమండీ శాస్త్రులవారు!

రెం-గృ—అయితే ఆయోగమక్కరలేదు బాబూ! మహారాజుగారూ! తాముసాధన చేయుచున్న యోగమే మాకు దయసేయండి.

నా-గృ—అనగా మహారాజుగారూ! చూడండి మాచుట్టూ మంచి మంచిస్త్రీలు చక్కనిస్త్రీలు గుమికూడవలెను. వారు తమ సుకుమారమైన చేతులతో మాకనేకవిధముల సేవచేయవలెను.

రెం-గృ—అంతేకాదు. వారుతమ భర్తల పిల్లల కడుపులుమాడ్చి మాకొఱకు మంచిమంచి పిండివంటలు వండి తెచ్చి అవితమ అందమైన చేతులతో మానోట పెట్టుచుండవలెను.

మూ-గృ—ఇక చెప్పవలసినది కొద్దిగానే ఉన్నది. మహారాజుగారూ! ఈచర్యలన్నీ తమ కన్నులయెదుట జరుగుచుండగా తెలివిహీనులయిన భర్తలు విధేయతతో నిలువబడి చూచుటయేగాక ధన్యులమైతిమని వారుతమ మనస్సులలో సంతోషించెడువారుకూడ కావలయును. ఈ యోగము పేరు మేమెఱుగముగాని మాం కదే కావలయును.

మొ-గృ—ఏమిటి అదేనా కావలసినది. అది మనకిచ్చి మహారాజుగారిచటనున్న ప్రయోజనమేమి.

మూ-గృ—మేము మహారాజుగారి శిష్యులమయి వారికాటంకము తెచ్చిపెట్టుదుమా! మేము వేరుగ్రామ మేదయిన చూచుకొందుము గాని. ఏమండీశాస్త్రిలుగారూ అంతేనా?

మొ-గృ—ఎందుకీకభుర్లు, మహారాజుగారు మన తలలమీద చెయ్యిపెట్టడమే ఆటంకము. ఒక్కనిమషములోనే యోగసిద్ధి. ఇచటనె యిప్పుడే సాక్షాత్కారము.

మూ-గృ—సాక్షాత్కారము! సాక్షాత్కారము! బాగా జ్ఞాపకము చేసినావు చాలు. లేకున్న మహారాజుగారి సాక్షాత్కారపు యితిహాసము మఱచిపొయ్యేవాడినే, మొన్నమంగలి యెవడో మహారాజుగారి వపనముచేసి యింటికి వెళ్లి గుడ్డదులిపితే దానికి బంగారు

వెంట్రుకలంటుకొన్నాయటు.

రెం-గృ—ఆనాటి పొట్టనొప్పిగాడు, ఏడీ? వాడేడీ? వాడిది సువర్ణ పురము. అచట వానియింట వానికడుపు మెలివేసుకునేసరికి యిచట యీ మహారాజుగారి కడుపు మెలివేసుకొని పోయినదట.

నా-గృ—మహారాజుగారు మందు పుచ్చుకొనేసరికి వాడికి కూడా గుణ మిచ్చి యుండును గదా!

మొ-గృ—ఇంతే నా తెలివి. భక్తుని సంకటము భగవంతుని బాధించిన తోడనే గుణము. వేరుగా మందులు మాకులు అవసరము లేదు.

నా-గృ—అయితే మా కాసాక్షాత్కారము కూడా కావలెను. దేవరా!

రెం-గృ—పౌరాణికుల వారి వంటి శిష్యులు మనచుట్టూ పోగయితే సాక్షాత్కారముల కేమిలోటు కావలసినన్ని.

మహా—అనగా సాక్షాత్కారములను గురించి మీకింకను అపనమ్మకముగానే యున్నదా?

మూ-గృ—అపనమ్మకమా! హరిహరీ! బాగా నమ్మకమేనండీ అవి టక్కులని. (మహారాజు నెత్తిమీద మెల్లగాతట్టి) ఈ తలమీది బొచ్చేగాదా బంగారమయినది.

మహా—(తనలో) ఇకనాగతి దుర్గతే (లేచి పోబోవును. మొ-గృ. వానిని చెయ్యిపట్టి యీడ్చి కూలవేయును. మహారాజు ననుచరులకు కోపమువచ్చును. మహారాజు కనులు మూసుకొనును.)

పౌరా—(చేతులు జోడించి) తమరందఱికి నాదొక మనవిగలదు. మహారాజుగారు సమాధిలో నున్నారు ఇపుడేమంటే వారి దేహము కాష్టలోష్టవతుగా మరేవంటే చైతన్యము లేనిదైనందున వారి యింద్రియములకు చలనము నష్టమయియున్నది.

మూ-గృ—గాని మ రేమంటే తొడలుమాత్రము కదలుచున్నవి.

పౌరా—వారు తమయాత్మను బ్రహ్మాండమున కెక్కించుకున్నారు. వారి స్థూలశరీరము మాత్ర మిచటనున్నది. గనుక ఇట్టి స్థితిలో ఏమంటే అల్లరిచేసి సమాధిని భంగపరచవలదు. అది మీకుచితము కాదు.

మొ-గృ—శాస్తుల్లుగారూ! మ రేమంటే పన్నాగాలు పన్నుటలో తమరు మాంచి ప్రజ్ఞావంతులేనండోయి. వాడు పాపము భయ భ్రాంతుడయి వాడలిపోతున్నాడు. వాడు యోగసమాధిలో నున్నా డని తమరు సెలవిస్తున్నారు. బలే!

మూ-గృ—ఇం తెందుకు. ఆరగులుచున్న అగరువత్తులు నాచేతికివ్వండి. వీడివంటికంటించి చూచెదను. (మహారాజులికిపడి కనులు తెరచును) బానిసకొడుక్కి సమాధేమిటి. చూచితిరిగదా అగరువత్తులనగానే ఉలికిపడ్డాడు.

అంబిక—చచ్చినాళ్లలారా! మీ కర్మము కాలా! మీచేతులు మండి పోనూ! ఏమిఅల్లరి ఏమిఅల్లరి.

చండిక—మహారాజుగారు శాపముయిచ్చి మీ అందర్నీ మంటలో కలిపివేసియుందురు గాని మీ పెళ్లాల ముఖముచూచి ఊరుకున్నా రు. వాళ్ళ అయిదో తనాలు గట్టిగాఉన్నాయి గనకనే మీరు బ్రతికినారు. వెళ్ళండి. ఇంక ఇండ్లకెళ్ళండి.

మూ-గృ—మంచిది. చాముండాపిన్నీ! అల్లాగేచేస్తాము. నీవు నోరు మూసుకుని పడిఉండి నీ పరువెందుకు దక్కించుకోవు.

మొ-గృ—ఇంక అదేమీకాదు. ఓరి మహారాజూ! నీవింక యీ యాసనము ధ్యానమువిడిచిపెట్టు.

మహా—(తనలో) ఇక మెత్తదనము పనికిరాదు. (గృహస్థులందరు కలసి మహారాజు నాసనమునుండి క్రిందికి యీడ్తురు.)

మూ-గృ—(ఆసనమెక్కి కూర్చుని) ఎంతమెత్తగా నున్నది!

రెం-గృ—దిగు క్రిందికి మురికివాడా!

విద్యా—(సమాజమువారితో) ఏమిటీదుండగము. మహారాజుగారు చేయునది యంతయు మఠములోనే చేయుదురు. బసవరాజుగారి బోటి భక్తిగలవారిశిష్యులు ఇచటికివచ్చి వారిని సేవింతురు. అయితే.

పౌరా—నేననేదీ అదే వీరికిప్రపంచములో జరిగేవ్యవహారముల జోక్యము అవసరములేదు.

మొ-గృ—ఓయి పౌరాణికుడా! మీపొట్టలు కాల్చుకొనుటకు ఈవేషములు పటాటోపములు పూని అమాయకులను దోచుకొని వారిని చెడుమార్గములో త్రోయకపోయినచో మేము మీజోక్యము కలుగజేసికొనక పోదుము.

పౌరా—మీరు బొత్తిగా పొరపడుచున్నారు. నేననునది యొకమాట విని—

మొ-గృ—ఇంకమాకు వినుటకేమియులేదు. మీకొకటేమాట నొక్కి చెప్పుచున్నాను. ఇంతటితో తెలివితెచ్చుకుని ఈ వేషములన్నియు కట్టిపెట్టి రెండుదినములలోగా యీ గ్రామమునుండి తలదాచుకొని వెళ్లితేనే మేలు. అథవా నామాటలెక్కసేయక యిచటనే నిలచి తిరిగి మీ ఆటలు సాగించితిరా మీకు గొప్పకష్టము సంభవించును. (సమాజమువారితో) నడవండి ఇఘు.

చండిక—పీడవిరగడయి పోయింది. వెయ్యేళ్లు వొంటికాలిమీద నిలబడి అన్నం నీళ్లుమాని తపస్సుచేస్తేనేగాని యిటువంటి వైభోగాలు దొరకవు. ఇవి ఇనప గుగ్గిళ్లుగాని మినపగుగ్గిళ్లు కావు.

రామయ్య—కడచిన యుగములలోని రావణ కుంభకర్ణ హిరణ్యాక్ష హిరణ్యకశిపులు వీరే.

బసవ—అందుకనే పూర్వ జన్మసంస్కారము ననుసరించియే ఈశ్వరావతారమును దూషించుట తిరస్కరించుటయును.

మహా—ఇది విరోధ భక్తి ఇదే మాకిష్టము. అజ్ఞులకు విపరీతముగా దోచుట సహజమేగదా.

పౌరా—చండికమ్మా! మహారాజుగారిని కాస్త విశ్రమింప నివ్వండి. నాస్తికుల అల్లరుల కేమిలే. జగత్తునకు కల్యాణము సమకూర్చ దలచినచో వీటిని సరకు చేయరాదు. (చండిక మహారాజును చేయిపట్టుకుని తీసికొనిపోవును. పౌరాణికుడు పద్మనాభుడు దక్క అందరు నిష్క్రమింతురు.)

పద్మ—ఏమిటండీ. జరిగింది. శాస్త్రుల్లుగారూ!

పౌరా—మనఅందఱి కర్మాలు కాలినాయి.

పద్మ—ఇంక ముందాలోచన? నేనిక సువర్ణపురము త్రోవపడతాను.

పౌరా—అయితే నీవిపుడేబయలుదేరకు, భోజనముచేసి మాయింటికి రా. అప్పటికేదో ఆలోచన స్ఫురిస్తుంది.

పద్మ—మంచిది. అల్లాగే చేస్తాను.

పౌరా—(తనలో) వాస్తవమే? ప్రత్యక్షంగా నిప్పుతగులుకున్న యీయింట్లో యెవరు నిలబడగలరు. నేనుకూడ ఇట్టిఆలోచన చేయవలెను. వ్యవహారము చెడినది. ఈపలుగాకు లూరుకోనరు. (ఆలోచించి) కానీ! మాస్వాధీనములోనూ కొందఱున్నారుగదా! అవసరముఅయితే యే తెలివిహీనుణ్ణో బట్టి మఠములో ఒకసహస్రభోజనసంతర్పణ దంచి పారేశామంటే సంభావనలు బాగాయిచ్చామంటే యిదంతా టుప్పున యెగిరిపోతుంది. అయితే జన్మంతా

యీపీకులాటలతో గడపవలసినదేనా! (ఆలోచించి) అదంతా కాదు. నాదగ్గరనున్న సొత్తేయెక్కువ. అది చంక బెట్టుకని—అయితే వట్టిద్రవ్యముతోనే సౌఖ్యము దొరకునా? చండికయున్నది గాని ప్రయోజనమేమి. ఆమెయొక్కతే చేయి చిక్కినజాలు.

తరువాత మహారాజైమైతే నేమి మరమేమైతే నేమి! ఆడుకో నీఆటలు. ఇదివరకు చూచిన ఆమె నడతనుబట్టి ఆమె స్వాధీనమగునా యని శంక కలుగుచున్నది. ఇక ఈశంక యెట్టిదైనా సరే నివారింపక తప్పదు. (చాలాసేపు ఆలోచించి) అయితే అది యిపుడే వ్రాసివేయవలెను. అప్పుడు కామాక్షియిటు; చీటీ అటు ముసలివాడి చేతులోనూ. దీనివల్ల మహారాజు కంఠానికి ఉరి. కాని ఆప్రమేయము నాకెందుకు.

(నిష్క్రమించును)

---

# పంచమాంకము

## ప్రథమరంగము

(బసవరాజు, ఆనందభువనసమాజమువారు మాటలాడుచుందురు)

విద్యా—అయ్యా! వీరందఱును తమరిని హెచ్చరించే యుండిరికాని వారిపక్షమున చేరినవాడను కానని నేనుకూడా యిచటికి వచ్చి అన్నిసంగతులు తమకు స్పష్టముగా చెప్పియుంటిని. కాని మీాకను లకు గమ్మిగమనసక వీడినది కాదు. మామాటలు తమరు నమ్మక పోవడమే కాక కనులారా చూచుచు అన్నిసంగతులు చేసినారు. ఎదురు మమ్ములను నోటికివచ్చిన మాటలు అన్నారు. ఇవి అన్నీ మఱచితిరా? ఇఘు వాటిఫలము అనుభవింపకతప్పునా?

బసవ—గోరుచుట్టుపై రోకటిపోటేల వేసెదరు? మీారు అందఱు నన్ను పేక్షించినయెడల మాత్రము మిన్నువిరిగి నామీాద పడు తుంది. దానికి బట్టినగతే నాకునూ పడుతుంది. (కంటనీరునించును)

మొ-గృ—దానికనగా యెవరికి? కామాక్షమ్మ పిన్నికేనా? (బసవ రాజొక చీటీతీసి అతనిముందు వేయును)

మొ-గృ—(చీటీ విప్పి చదువుకొని) హత్యచేసుకొన్నదా?

బసవ—మరి అది యేకారణమువల్లనో చదవండి చూద్దాము.

మొ-గృ—(ఉత్తరము చదువును)

చరణముల సన్నిధికి, విన్నపము

ఈరోజువరకూ దురదృష్టవంతురాలిని. తమరు చాలాదయతో మేలినారు. నాపంతాలు అన్నీ చెల్లించినారుకాని నేను నాచేతులారా తమరికి చాలా దుఃఖము తెచ్చిపెట్టుచున్నాను. అందుకు నన్ను

మన్నించవలెను. ఏనాడు నేను మఠములో కాలుపెట్టినానో ఆనాడే నాకర్మము మూడినది. అమాయకురాలైన యితర ఆడవాళ్లను చూచి నేనుకూడా మఠములో ఉండే టక్కరిగాళ్ల; కటికివాళ్ల వెంట పడ్డాను. పిల్లవాడు పుట్టవలెను, ఆమోక్షము దొరకవలెను, అంటారే అది దొరకవలెను. అను ఆశ. నేనేమీ నేరనిదాననని కనుక్కొని యింటి నుంచి యీనగతే ఆనగతే అని ఉన్ననగలన్నీ తెప్పించుకొని వాటికి బదులు అల్లాంటివే గిల్టునగలు నాకంటగట్టినాడు. పాపము చండి కమ్మ గొంతుకకూడా అల్లాగే కోసినాడు పాపము పురాణముచెప్పే అతనుమాత్రము మంచివాడు. అతనికి యీఘాత తెలియడముతోనే మాకు తెలియచెప్పినాడు. ఇంటో ఉన్నదంతా నామూలమున లేకుండా అయిపోయినది. ఇంక ఇంట్లో మొగము చూపించడానికి నాకు సిగ్గుగా ఉన్నది. అందుచేత నేను నాచావు కోరుకున్నాను. నాకేమీ తక్కువలేకుండేది దేవుడు నాకు బంగారమువంటి సహవాసము యిచ్చెనుగాని దురదృష్టురాలికి నాకు అది అచ్చిరాలేదు. అయింది ఇంక నా ఆయుస్సునిండింది. కామాక్షి.

బసవ—అది ప్రాణములను బాసినదిగదా! ఇంక యేమయినా సంశయమున్నదా? (కంటనీరుపెట్టుకొని యుత్తరీయముతో అద్దుకొనును)

విద్యా—(దుఃఖముతో) బసవరాజుగారూ! మీరు ధైర్యము వదులు కోకండి. ఈ కష్టము మీకొక్కరికే గాక మాకందరికీ సంప్రాప్త మయినది అనుకుని నిశ్చింతగా ఉండండి.

బసవ—నేనయిననూ చేయునదేమున్నది? నాభారమంతా మీదే మీకు తోచినట్లు చేయండి.

విద్యా—ఏమండీ! మీభార్య చదువుకున్నదేనా?

బసవ—ఎంతచదువండీ! ఏదో కొద్దిపాటిగాని బాగా వ్రాయలేదు.

విద్యా—అయితే యీవుత్తర మూమె వ్రాసినదనేనా మీఅభిప్రాయము. మీకామె వ్రాలు బాగా తెలుసునా?

బసవ—అనగా ఇది యామె వ్రాసినది గాదనియా తమరనేది. అందులో వ్రాసిన హంశములన్నీ నాకూ దానికీ చక్కగా తెలిసియున్న విషయములే. కాని దానిచేత వ్రాయబడిన వుత్తరమిదే మొదటి దగుటచేత యిది దాని సంతకమగునో కాదో చెప్పజాలను. అయితే అచ్చముగా యితరులు యిట్లా వ్రాయగలరా.

విద్యా—బసవరాజుగారూ! ఈజాబు నిజమైనదని నాకు నమ్మకము లేదు. అసలు వ్రాలు బాగా వ్రాయగలిగియు చేజేత వంకరటింకరగా వ్రాయబడినట్లున్నది. (సమాజమువారికి జాబు చూపుచూ) చిత్తగించండి. ఈ 'ప' మరి ఆ "ప" ఒకటిగా లేవు. వ్రాయుటలో నెంతో వ్యత్యాసమున్నది. చూచితిరా? ఈవ్యవహారము చిత్రముగా నున్నది.

రెం-గృ—అదిగాక ఆడువారింత సందర్భశుద్ధిగా వ్రాయలేరు. ఈలేఖ నాటకములోని వ్యాసమువలె నున్నది. అందులో నాటకపుపైఖరి కూడ కనుపించుచున్నది.

మూ-గృ—ఇది యెవరో టక్కరి కల్పించినట్లున్నది.

మొ-గృ—ఎవడోగాని మహారాజు కంఠానికి తెచ్చిపెట్టి పౌరాణికుని మాత్రము ఆకాశానికి ఎగనెత్తినాడు చాముండ పాపమెరగని సాధ్వి అన్నాడు. ఇదియొక సమస్యే దీనిని విడదీయుటకు మంచి చాతుర్యమే కావలయును.

రెం-గృ—ఏమండీ బసవరాజుగారు! నగలన్నీ సరిగా చూచుకున్నారా వానిలో తేడా యేమయిన నున్నదా?

బసవ—ఏమి చెప్పుకోనండీ—ఉన్న బంగారు ముత్యములు రవ్వలు అన్నీ పోయి వాటికి బదులుగా గుల్లముత్యములు, గాజురాళ్లు, గిల్టుబంగారము తెచ్చి యుంచినట్లు కనబడుతున్నది. నేనిది కని పెట్టినన్నీ పోనీ అని మెదలకుండా ఊరుకున్నాను. ఇక ఆనగ లెవరికి కావలెను లెండి.

విద్యా—ఈజాబు తమకందగానే మాకు చూపించిన నెంతో బాగుండును. ఆవిడ మాయమైన వార్త రెండుగడియలుముందే మా చెవిని పడినది. ఘోరమైన ఈవ్యవహారములో మహారాజునకు గాని పౌరాణికునకు గాని ప్రత్యక్షముగానో పరోక్షముగానో సంబంధ ముండి తీరవలయును అని మాకు తోచినందున జరిగిన వృత్తాంతము న్యాయాధిపతికి తెలిపి మరము జప్తుచేయించి మహారాజును బంధింపచేసి తిరిగి వచ్చేసరికి మీారు మమ్ములను పిలవనంపినారు.

బసవ—ప్రతిరోజూ దేవతాదర్శనమునకు వెళ్లి తిరిగి యింటికి వచ్చే సమయ మతిక్రమించగానే నల్దిక్కులు వెదకించినాను గాని ప్రయోజనము లేకపోయినది. అంతట నేను హడలిపోయి మీయొద్దకు రాదలచితిని గాని మొగము చెల్లినదికాదు. కొంచెము కూర్చుని తిరిగి లేచి రెండడుగులు వేసేటప్పటికి ఈఉత్తరము వాకిటపడి యున్నది. తీసి చదివితిని నాప్రాణములు క్రుంగిపోయినవి. అపుడు మీయొద్దకు సోమడిని పంపినాను.

మూ-గృ—అయితే యీఅసందర్భములు సమర్థించికొనుట యెట్లు. వుత్తరము వీరిభార్య వ్రాసినదని తోచదు. అందలి సంగతులసత్యమందుమా? ఆమె మాయమైనది. నగలు పోయినవి. ఈవ్యవహారముతో మహారాజునకు సంబధమే మాత్రము లేనిమాట నిజము. అయితే యీనాటకానికి సూత్రధారుడెవరు?

విద్యా—చండికయూ పౌరాణికుడూ నిన్న టినుండి మఠములోలేరు. వీరిని వెంటనే పట్టుకోగలిగితే సూత్రధారుడెవరో తనంతటతానే బయలు పడతాడు.

మొ-గృ—విద్యాధరుడుగారు! బాగా చెప్పినారండీ. బసవరాజుగారూ! మేమిక యీవ్యవహారములోనే యుండెదము. జరిగిన విషయిములు మీకువెంటనే తెలిపెదము. మీరింక చింతమాని స్వస్థముగా నుండవచ్చును. భోజనమయినదా? లేదు. అయినట్టులేదు. భోజనము చెయ్యండి. కడుపు మాడ్చుకున్న ప్రయోజనమేమి?

సోమ—(తత్తరపాటుతో) అయ్యా కామాక్షమ్మగారిని పురాణ బ్రాహ్మడు తనింటికాడ కొట్టులో తాళం యేశారుటండి.

మూ-గృ—నీకెట్లు తెలియును?

సోమ—పురాణం బ్రాహ్మడూరికి యెల్తాడంట నేనట్టా యెల్తా వుంటే దారిలో నాపెల్లాం కలిసి సెప్పింది. అది ఆయనయింటి కాడ పనిచేస్తుంది అది సూసుండాల అంతాను.

విద్యా—(సమాజము వారితో) సరియేనా నేను చెప్పినదంతా నడ వండి పోదాము (నిష్క్రమింతురు) "నుదుటన్ వ్రాసిన వ్రాలుకన్న కలదే నూరేండ్లు చింతించినన్" అన్నమాటే సత్యము. దానికి వ్యతిరేకముగా లవలేశమయినా యీప్రపంచమున మనుజుడు జరుపగలుగునా?

---

ద్వితీయరంగము

స్థలము—కుంజపురములో రాజమార్గము

అంబిక—మీరు అదృష్టవంతులు రామయ్యగారూ! అదంతా చూడడం నారాతలో ఉంది. చచ్చినాళ్లు మహారాజుగారిని పెడ

రెక్కలు విరిచి తాళ్లతో బిగించి కట్టినారండీ నావళ్లు మండుకు పోయింది. నే నెప్పుడైనా మొగాళ్లయెదుట ధైర్యంగా నిలుచున్నానా! కాని మారాజు పాట్లు చూచి నిలవలేక వాళ్లనందరినీ నోటికివచ్చినట్లల్లా తిట్టినాను.

రామయ్య—నే నక్కడ లేకపోయినాను. ఉండిఉంటే కలియబడే ఉందును. అయితే నీవేమి అట్టే వుంచావా!

అంబిక—ఆఁ నేనే అట్టే వుంచేదాన్ని! నేనన్నాను 'చచ్చినాళ్లలారా! మారాజు దేవుడ్లాంటివాడు. అట్లా తాళ్లతో బిగిస్తారేమి' అని; కాని ఏమిటండీ! వాళ్లందరూ హిహిహీ యని యికిలించారు. అందులో ఓ పలుగాకి నన్నన్నాడుగదా అమ్మో చాముండా పిన్ని!......

రామ—ఎవర్ని నిన్నేనా?

అంబిక—(ఏడుస్తూ) ఔనండి. నన్నే చచ్చినాడు చాముండా అని ఇంకా యేమన్నా డనుకున్నారు. దేవుళ్లాంటివాడా! వీడు ప్రత్యక్షంగా మహావిష్ణువు అవతారము. వీడికి నాలుగుచేతులు లేకపోయాయని చతుర్భుజుణ్ణి చేస్తున్నాము అన్నాడు. మహారాజుగారిని తన్నుతూ మఠంబైటి కీడ్చినారు. యమదూతలు యెక్కడికి యీడ్చుకువెళ్లినారో యేమో? పాప మతణ్ని. అయితే రామయ్యగారూ! మీా రెక్కడికి వెళ్లియుండిరి.

రామ—నే నొక చోటికి భోజనానకు వెళ్లియుంటిని. స్నానంజేసుకుని తిన్నగా అచటికే వెళ్ళితిని. తిరిగి వచ్చేటప్పుడు చూస్తే మఠానికి తాళము. యేమయినదీ తెలిసినదికాదు. నీ జా డెక్కడా లేదు. మఠానికి వాళ్ళే తాళం బిగించినట్లుంది.

అంబిక—ఔను. వాళ్లల్లో యెవడో దుంగలాంటివా డున్నాడు వాడు చెప్పినట్లల్లా కడమవాళ్లు చేసేవారు. వాడు నావంటిమీాద ఈ

రెండుగుడ్డలు విసిరేసి యేగుళ్లోనో యేసత్రవులోనో బస చేసుకో పోయి అన్నాడు. అవి పట్టుకుని నే నిందాకటినుంచి ఆకు నందక పోకను పొందక ఇల్లా అల్లాడుతున్నాను.

రామ—అయితే మహారాజుగారి సంగతేమిటి?

అంబిక—(ఉలికిపడి ముందుకు చూచి) రామయ్యగారూ! చూసినారా ఎంత పెద్దగుంపు వస్తున్నదో. ఎవర్నోగాని దొంగలా కట్టి తెస్తు న్నారు. (బాగా చూచి) రామయ్యగారూ! మహారాజుగారేనండి అతను. అతనివే ఆ పెద్ద పెద్ద అంచుధోవతులు. ఆపాట్లు చూడడం కంటె కళ్లుపోతే నయం (కళ్లు మూసుకొనును)

రామ—అంబికమ్మా దారిలోలే, దారిలోలే కళ్లు తెరువు.

అంబి—(కళ్లు తెరచి) యేమిటి! ఇక దారేమిటి వల్లకాడేమిటి అంతా వాకటే. ఇంక మహారాజుగారి నేమిచేస్తారండీ?

రామ—చేసేదేమున్నది. ఇది వారి అవతారసమాప్తి అయ్యేకాలము. దేవతల మాటలు మనము వినడములేదా. ఒక కిరాతుడిబాణం తాకగానే శ్రీకృష్ణులువారు దేహం వదలిపెట్టినారు. ఇవన్నీ వ్రాసి పెట్టినవే. కాని మహారాజుగారు తలచుకొనడమే ఆలస్యం అప్పటికి వీళ్ల కోతిచేష్టలెందుకూ కొరగావు.

అంబి—నిన్నటినుంచి పొట్టలో కూడులేదు. ప్రాణము పోతున్నది. కాస్సేపు యెక్కడైనా వళ్లు వాల్చాలి పోతాను.

రామ—అంబికమ్మా! అల్లాకాదు (రొంటినుండి కానులుతీసి) ఈరెండు డబ్బులు పుచ్చుకుని ఏమయినా కొనుక్కుని నోట్లో వేసుకుని కాసిని మంచినీళ్లు పుచ్చుకో. కాస్త ప్రాణవస్తుంది. నాగతీ అంతే. మహారాజుగారి నీడనుండి షడ్రసోపేతముగా కడుపునిండా తినే వాడను. ప్రపంచమంటే లక్ష్యపెట్టేవాడను గాను. అది యాచండా

లులు చూసి యోర్వలేక పోయినారు. నిష్కారణముగా వీళ్లు అందరికూటిలోనూ మన్ను కలిపినారు. నేనూ పోతాను ఇక పోయి ఎక్కడయినా బ్రాహ్మణార్థము చూసుకుంటాను.

(ఇరువురు నిష్క్రమింతురు)

---

## తృతీయరంగము

—:o:—

స్థలము—కుంజపురములో పౌరాణికుని గృహము

(కామాక్షి, చండిక మాటలాడుచుందురు)

కామా—మీరు నాకోఱకెంత జాలిపడ్డారు. ఒకమాటు పురాణీకు డింటిదాకావస్తే అతణ్ణి అడిగి ఆటక్కరి ముండాకొడుకులు దిగ మింగిననగలు పెకలించే ఉపాయం చెపుతానన్నారు. మీమాటలు నమ్మి తెల్లవారఝామునుంచీ వచ్చి కూర్చున్నాను. ఇప్పుడు నగలు తెచ్చియిస్తానని ఆతడెక్కడికో వెళ్లి రెండుఝాములయింది ఇంతవరకు అతడిజాడలేదు. మరి మీరనేమాటలేవో ఇల్లాఇల్లా ఉన్నాయి. పోయిననగలేవో పోనేపోయినాయి. మెదలకుండా ఇంటో కూర్చోక నేనిక్కడికి రావడమెందుకు? నామనస్సెంతో కలవరపడుచున్నది. లోభపాశములో జిక్కుకొని కిరాతులవంటి దుర్జనుల స్వాధీనమైపోయినాను. (తలుపుచెంతకుపోయి తెరవ బోగా తెరవబడదు) చండికమ్మా! యీతలుపు కాస్త తియ్యండి.

చండి—(ప్రయత్నించినట్లు నటించి) ఈవీధి కుఱ్ఱవాళ్లు చాలాతుంట రులు. పయిని గొళ్లెము పెట్టినట్టున్నారు. పురాణీకుడువస్తే అతనే తీస్తాడు. కామాక్షమ్మా! ఇంకానయము నే నెట్లాంటిదాన్నో నీకే తెలుసును.

కామాక్షి—అదేనమ్మా నాకొంపముంచింది.

చండిక— మంచిగాని చెడ్డగాని నే నెప్పుడు యెవ్వరిజోలికి పోనుగదా! చేతనైతే మంచిచేస్తాను. లేకపోతే నోరుమూసుకునికూర్చుంటాను. ఇది నాపుట్టైనుపుట్టినబుద్ధి. అయితే నేనిందాకా చెప్పినమాటలు నీవు కనుక్కోనట్టేనా?

కామాక్షి—నాకా కనుక్కోవడం గినిక్కోవడం యేమీవద్దు. నన్నవతలకి పోనిస్తే చాలు.

చండిక—నీవు పురాణీకుడిపక్కని నిలిస్తే మీజత యెంతోఅందంగా ఉంటుంది. నీకిల్లాంటి చక్కని మొగుడు కావాలని నేనన్నమాట లబద్ధముకాదు.

కామాక్షి—నీనోరు తగులబడిపోను.

చండిక—నీవు యేమన్నాసరే బసవరాజుగారిలో యింక త్రాణేలేదు పాపము! ఆ బోసినోరు, పుసులకళ్లు, అబ్బే; అతనివంక నీవు చూడనైనాకూడదు. ఆపురాణీకుణ్ణిచూడు. ఆపడుచుదనం. ఆచక్కదనము. అతడునిన్ను దగ్గరకుతీస్తే సుఖంగా కాపరంచేస్తావు. చాలా చదువుకున్నాడుకూడాను.

కామా—వాడి చదువు చక్కదనము తగుల పడ్డట్టేఉన్నాయి. ఆ వెధవతో నాకేమిపని? ఒకమాటు దేవుడు వేసినముడేముడి.

చండిక—ఆఁ దేముడేస్తాడుముడి. కానీ పోనీ వాళ్లతోవేస్తే ఆముడీ తెంపివేయవలసిందే. పోనీ నామాటెందుకు. శాస్త్రుల్లుగారు పెద్ద పెద్దగ్రంథాలు చదివారు. వారిని అడిగిచూడు ఏమంటారో.

కామా—చదివియుండవచ్చు చచ్చినాడు. నాకేమిపని?

చండిక—ఎందుకమ్మా వాకర్ని అట్లా తీసిపారెయ్యడము. పురాణీకుడిలాంటి బ్రాహ్మడు యెక్కడైనా దొరుకుతాడా? చాలాపెద్ద

మణిసి యేమనుకున్నావో. 'నీచక్కదనమేమిటి దానికిపట్టిన గతే మిటి; అని అతడు చాలావిచారిస్తుంటాడు పాపము.

కామా॰—నాకోసం ఆచచ్చినాడికెందుకు విచారము. వాడు నా చుట్టమా పక్కమా! అదేమీలేదు. వాడుమనసులో యేదో పాపముదలచినాడు. దరిద్రగొట్టుముండవు నువ్వు వాణ్ణి యింకా పురిపకుతున్నావు.

చండిక—వేళాపాళా చూడకుండా యిల్లామాట్లాడవచ్చా. శాస్త్రుల్లు వచ్చేవేళఅయింది. అతడు యీమాటవింటే అతనికి యెంతకష్ట ముగా ఉంటుంది.

కామా॰—వాడికి కష్టమనిపిస్తే నాకేమీ? ఆయముడు రాగానే నన్నుపోనిస్తేచాలు. లేకుంటే మీయిద్దరి కళ్లయెదుట నేను ప్రాణ ముపోగొట్టుకుంటాను. అంతకంటె మార్గములేదు.

చండిక—ఏమిటీచిందులుదొక్కడము యివ్వేళ. యెవరైనాచూస్తే నిజమే అనుకునేరు. యిక యీవేషాలు కట్టిపెట్టుదూ! పురాణీ కుడిమీద మనస్సేమో బాగాఉన్నది. ఇకపైకి ఊరికే అతనిని తిట్టడము. చాల్లేతూ. మనస్సులోమాట వెళ్లబెట్టరాదు ఓమాటే. పోనీ పాపము నాకెందుకు చెబుతావు. ఎవరిమాటవారికే చెప్పితే మంచిది. అదుగో రానేవచ్చేడు మంచివేళకేవచ్చాడు. ఆం (పౌరా ణికుడు తలుపుతీసుకుని లోనికివచ్చి తిరిగి తలుపుమూసి యచటనే నిలుచును).

పౌరా—(కామాక్షి వంకచూచి) నేడు ముఖమెందుచేతనో వాడినట్లు న్నది. చండికమ్మా నీవేమైనా అధికప్రసంగము చెయ్యలేదుకదా?

చండిక—అబ్బే లేదండీ. ఇదుగో శాస్త్రుల్లుగారూ! (చెవిలోచెప్పును) అయితే నామూలంగా ఆటంకమువచ్చింది. నిజమే పానకములో పుడకలాగ నేనెందుకు.— — —

కామా—నీలాంటి సిగ్గుమాలింది యీమూడు లోకాలలోనులేదు. నేను ఇన్ని మాటలన్నా నీపాడుబుద్ధి పోలేదుగదా?

పౌరా—కామాక్షి! నీమంచిచెడ్డలు నీవింకా తెలుసుకోలేవేమి. ఇదుగో చండికమ్మవంటి యీడు ముదిరిన — — —

చండి—(కోపముతో తనలో) నేనా యీడుముదిరినదానను.

పౌరా—ఈడుముదిరిన మణిషి అనుభవశాలి మీాకీడుకోరునా? ఆవిడ బోటివారు దొరకడము సామాన్యమా?

ఈప్రమాదముచేసిన స్త్రీదుర్దశయే దుర్దశ.

చండిక—నిజంగా నేనా. మరిదానిగతి యేమవుతుంది.

పౌరా—దేనికోరికలు యీజగత్తులో తీరక మిగిలిపోవునో అది వేశ్యగా జన్మించును. ముందుజన్మలో నది భోగముదిగా తప్పక పుట్టవలసినదే.

చండిక—భోగముపుట్టకే! వద్దమ్మా! తల్లీ! కావలసినదంతా యీజన్మాననే అయిపోనీ. నిజమేనా? కామాక్షమ్మా!

పౌరా—ఇదిగాక ఆసౌఖ్యములు ఉపభోగములూ అన్నీ తమవయస్సులతోనే అనుభవించవలసినదని దేవునియాజ్ఞ. ఈయాజ్ఞనుల్లంఘించి నీతలిదండ్రులు నిన్నా ముసలిబసవరాజు మెడకంట కట్టినారు. వారుచేసిన పాతకము నీవు నీకృతివల్ల పారదోలడము నీకు విధాయకము. బసవరాజా! నీమెడకుగట్టిన బండను యిక తెంపవెయ్యి.

చండిక—ఇదే నేనిందాకటినుంచి బోధిస్తున్నానండీ.

పౌరా—వాడికిక నీప్రపంచముతో సంబంధముడు తెగిపోయినట్లే. అన్నివిధముల సుఖోపభోగములు సమకూర్చగల ద్రవ్యమేదయితే కలదో అదికూడా యిపుడు నాయొద్ద సమృద్ధిగాకలదు. కనుక

అన్యక్షుద్ర ఆలోచనలు మాని మరేమంటే నాతోగూడి సౌఖ్యముగా, కాలముగడుపుకొనుము ఊం ఔనని యొకమాటు తలయూచినంతనే ప్రయాణసన్నాహము చేసెద.

కామా—చచ్చినాడా! నీ మొఖం మండిపోనూ రాక్షసుడా! నువ్వూ నూ యీదెయ్యంముండా యొకరిమెడ నొకరుపడి తైతక్కలాడండి నాజోలికిమాత్రము రాకండి. నరకానపడి మీరేడుస్తూ నన్నుకూడా యెందుకు యీడుస్తారు అందులోనికి. మీరిద్దరూ నాయిల్లంతా తుడిచి ఆ ముండాకొడుకు కొంపనింపే నింపినారు. ఇహా ఇక్కడికి తెచ్చి నా గొంతుకకోస్తారా.

చండిక—ఏమిటీ! నిన్ను బొట్టుకాటుకపెట్టి యెవరైనా పిలుచుకొని వచ్చినారా యేమిటి?

కామాక్షి—గోవువంటిదాన్ని. నా ఉసురుపోసుకుని యేనరకములో పడదామనుకుంటున్నారు. ఆగుళ్లో కూచుని బిచ్చమెత్తే పీనుగే యిపుడు పెద్దగొప్పవాడనయినానని చెప్పుకుని నన్ను పాతకము కట్టుకోమంటూన్నాడు. నీనోట్లో పురుగులుపడతాయి ఛీమను కుంటున్నావో!

పౌరా—కామాక్షమ్మా! తెలిసినది. నీ యిల్లుదోచి యే మూడవవాడికో అనగా ఆటక్కరికిమూటకట్టి యిచ్చిన తెలివిహీనుడు నీ ప్రేమకు పాత్రుడుగాడని కదా నీ యభిప్రాయము అయితే యింతటి దూరదృష్టిలేనివాడు నీ ప్రేమ నెట్లపేక్షింపగలడు. మురళీధరాలయములో మన మొకరినొకరు చూచినపుడే మనమిరువురము నొకరి ప్రేమపాశముతో నొకరు యెప్పటికైననూ బద్ధులము కావలసినవారమే అని నేను మనస్సులో నిర్ధారణచేసుకునే యుంటిని.

చండిక—కామాక్షమ్మా! ఎంతఅదృష్టమమ్మా నీది.

పౌరా—అంతస్సులో నీకు నాపై ప్రేమ కలదని నే నెఱిగియున్నవాడనే కాని మన అన్యోన్యానురాగమును వెల్లడించుటకు మన కనుకూలమైన అవకాశము ఇదివరకు చిక్కినదికాదు. అందుకు మనమేమి చేయగలము నీనా సహవాసము స్థిరమైనపిదప నీ వైభవమునకు ఆవశ్యకమైన అలంకారము లేవై తేకలవో అవి నీయొద్దనుండి చండికమ్మచేత తెప్పించుకొని మరేమంటే నా స్వాధీనములో జాగ్రత్త చేసి యుంచినాను. (పద్మనాభుడు బైట తలుపుకొట్టును)

చండిక—అయితే కామాక్షమ్మా శాస్త్రుల్లుగారిని నీ కోసము ఇంకా యేమి చేయమంటావమ్మా.

పౌరా—బసవరాజునొద్ద ఇంక నేమియున్నది. బంగారునీరు పోసినవి, గుల్లముత్యములు, గాజుతునక లమర్చిన నాటకపునగలు మూట కట్టుకుని కూర్చున్నాడు. నీకు సౌఖ్యము దొరకవలెనని మఠములో ఉండే ఆ వేషగాడితో మోసముచేయవలసివచ్చినది. అయిందా! యిప్పటికైనా నీ కనుమానరాహిత్యము కలిగిందా? లేని గొప్పతనము నేను తెచ్చిపెట్టుకోలేదు కదా! ఇంతెందుకు చండికమ్మా ఆ గోముఖపట్టుకురా. (తెచ్చియిచ్చును) అందలినగలు పైకితీసి, చూడు ఇది నీ ముత్యాలహారము. ఇది చంద్రహారము. చూడు చెక్కు చెదరకుండా వుంచినానో లేదో?

కామా—తీరిందిసుమా నా అనుమానము బొత్తిగా తీరిపోయింది. చివరకు నే నీయముడు చేతుల్లో చిక్కినానుగదా!

పౌరా—యముడు అను యేమయినా అను నేను చేసినదంతా నీసౌఖ్యానికే కనుక సుహాస్యవదనముతో నన్నంగీకరించితివని అను. కామాక్షీ! యింక ఆలస్యమెందులకు—(పద్మనాభుడు తిరిగి తలుపుకొట్టును)

చండిక—ఎవరమ్మా! ఇందాకటినుంచీ తలుపుకొడుతున్నారు ఊరికే.

పౌరా—వాడా! పద్మనాభుడు కాబోలు. కూర్చోనీ ఆ వెధవని అక్కడే (తనలో) ఇదేమిటా దారికివచ్చునని తోచదు. ఇక నుగ్రము దాల్చవలెను. (ప్రకాశముగా) ఇక నా అంతు ఎంతవరకు చూచెదవు?

కామా—నీ నోట దుమ్ముపడ పసరానికున్నంత సిగ్గైనా లేదేమిరా నీకు—

పౌరా—(కోపముతో) కామాక్షీ! నీవు మంచి బుద్ధిమంతురాలవు దూరపుదృష్టి కలదానవు అని నేనుతలచి యుంటినిగాని, స్త్రీలకు తగని అవమర్యాద మాటలాడుచుంటివి. ఫలితమేమగునో అలోచించితివా?

కామాక్షి—ఆఁ ఆలోచించినాను. బాగా ఆలోచించాను.

పురాణములో యిల్లాంటి కథలెన్నో ఉన్నాయి. అవి పీఠ మెక్కి కూచుని నీవే గాదట్రా చెప్పేవాడవు ముష్టివెధవా! పతివ్రతలను బాధపెట్టినవా డెవడు బాగుపడ్డాడు. అందరూ నోటమన్ను కొట్టుకునే పోయారు.

చండిక—ఇవన్నీ యెక్కడ నేర్చినావు. మేమిూ వేషాలు బూటకాలు కలలోనైనా చూడలేదు ఎప్పుడూను.

పౌరా—ద్రౌపదివంటి పెద్దపెద్దవారి ప్రసంగము లిప్పుడెందుకు? అది ద్వాపరయుగము. ఇది కలియుగము. ఈ యుగములో ప్రసంగము ననుసరించి మెసలుకోవడమే బుద్ధిమంతులపని. ద్రౌపదిని శ్రీకృ కృష్ణుడు కాచుచుండెను.

చండిక—ఏమి. కామాక్షమ్మా! నిన్ను కాచేవాడెవడైనా ఉన్నాడా లేదా మరి. పిలువు వాడిని. చేటుపుట్టినది. మరేమిూలేదు. శాస్త్ర

ల్లుగారు! మీా కేమిటండీ పిరికిబంటులాగ చేస్తున్నారు? మంత్రాలకి మామిడికాయలు రాలతాయా? చచ్చిందాన్ని చెయిపట్టుకుని జరజరలాగండి చూస్తారేమి?

పౌరా—అయితే ద్రౌపదీ కృష్ణులమాట యెక్కడ ఎందుకు పనికిరాని పామరులము మనమెక్కడ. ఇక నేనే దుశ్శాసనుడనై నిన్ను పరాభవించెదను. పెట్టుమొర యెవరిపేర పెట్టెదవో. ఎవరువచ్చి నిన్ను రక్షిస్తారో చూస్తాను. (కొంగుపట్టుటకు ముందడుగు పెట్టును.)

కామాక్షి—మాలవెధవా నా వంటిమీాద చెయ్యివేస్తావా? (పౌరాణికుడు కొంగుపట్టుకొనును. కామాక్షి విదలించి కొంగులాగుకొని వెనుకకు జరుగగా చండికమీాద పడును. చండిక దానిద్రోసివేయగా నేలపడి స్పృహతప్పును.)

పౌరా—ఓహో! యీా వేషమాయిక, కామాక్షి నంటపోవును.

పద్మనాభుడు (తలుపు బద్దలుకొట్టి లోనప్రవేశించి పౌరాణికు నడ్డగించును) శాస్త్రుల్లూ! జాగ్రత్త ఇక నొకఅడుగు ముందుకు వేస్తే—

పౌరా—కృతఘ్నుడా! మంచిసమయాని కిట్లు ఘాతచేసెదవా? (చేతికఱ్ఱయెత్తి) నీకు నూరేండ్లు నిండినవి. (పద్మనాభునిమీాదికి దుముకును)

(చక్రధరుడు యిరువురు పోలీసువారితో ప్రవేశించి)

చక్ర—హా! శాస్త్రీ!

పౌరా—(తనలో) ఇకమాత్రము కష్టమే.

చండిక—(తనలో) అమ్మయ్యో! (విద్యాధరుడు ఆనందభువనసమాజమువారు పోలీసువారు, మహారాజును తీసుకుని ప్రవేశింతురు)

చక్ర—ఏమోయీా! శాస్త్రీ! ఆమె యెక్కడనున్నది?

చండిక—పాయిలోవుంది. శాస్త్రుల్లుగారిని యేమడుగుతారు

పౌరా—ఇక దీనికి మించిన స్త్రీకౌటిల్య ముండ నేరదు.

చండిక—నిజమే. వట్టె పుణ్యానికి, నేను అంతా చేసి చెంది. — —

పద్మ—ఏమి యీ నీచత్వము శాస్త్రుల్లుగారూ! (చక్రధరునితో) ఇదిగో చూడండి. కామాక్షమ్మగారు యిక్కడ స్పృహతప్పి పడియున్నారు (చూపును.)

చక్ర—(పౌరాణికునితో) ఏమిటీ ఘోరమంతాను.

పౌరా—ఆ సర్వేశ్వరునికే తెలుసు.

చక్ర—(గోముఖ వంక చూచి) యిందులో మెరుస్తున్న దేమిటి?

పౌరా—అందులో మెరిసేదే ముంటుంది. చండికమ్మా ఆగో తీసి యింట్లోపెట్టు (చండిక తీయబోవును)

చక్ర—జాగ్రత్త! అది ముట్టుకోకు.

మూ-గృ—(గోముఖిలోనుండి ముత్యాలహారము తీసి) బలే! శా ల్లుగారూ! ఇదేనా తమజపమాల (పౌరాణికుడు చండిక క్రో వేశము చూపింతురు)

పౌరా—దీనినే స్త్రీ చాతుర్యమంటారు.

చండిక—చచ్చింది తనే నగలుపట్టుకువచ్చి మా మెడల కురితెచ్చిం..

మహా—(తనలో) అనగా? యీ ఫాజీలు నా తలకు బురదపూసి నట్లా. మఠములోనగ లిచట కెట్లావచ్చినవి.

చక్ర—ఏమోయి! పౌరాణికా! నీవు చేసిన ఘోరకృత్యములకు ఇంకా యేమి సాక్ష్యముకావాలి. (రాజభటులతో) వీడిని యీ ముండను పెడరెక్కలు విఱిచికట్టండి)

చండిక—చూదాముగా! ఆడదానివంటిమీాద చెయ్యి యెట్లా వేస్తారో!

చక్ర—(రాజభటులలో నొకనితో) నీవుపోయి బసవరాజుగారినిన్ని మీనాక్షిని పిలచుకొని బసవరాజుగారిని తమనగలు వెంట

తెమ్మని చెప్పు. (విద్యాధరునితో రహస్యముగా మాటాడి) ఏమి పౌరాణికుడా! బసవరాజుగారి పేర కామాక్షమ్మ వ్రాసినట్లు నీ వేనా ఈ జాబు వ్రాసినది. (ఉత్తరము చూపును)

పౌరా—రామ రామా! వైదికభిక్షుకుడను. నాకు త్తరాలు గిత్తరాలు వ్రాయడము చేతవుతుందా అండీ.

పద్మ—ఉత్తరము సంగతి నేను చెబుతాను తమకు.

కాప—చెప్పు? చెప్పు? మరి నీవు మారినకారణము కూడా చెప్పు?

(బసవరాజు; వెంటనే మీనాక్షి ప్రవేశము)

...నూ వీళ్లవంటి పాతకుడనే, నేను జన్మదరిద్రుడనగుటచే ...న్యని కాశపడి వీరిచేత చిక్కినాను. నే నీ జరిగినకృత్యములో ...గా నలేదు. నేటిఉదయము చండికమ్మతో మాటలాడదామని ...మాక్షమ్మగా రిక్కడికి వచ్చినారు. వచ్చి కూర్చోగానే బసవ ...రాజుగారి యింట్లో వేసిరమ్మని పౌరాణికుడుగా రీ జాబు నాచేతి ...చ్చినారు. ఆ వుత్తరంలో సంగతులు నాకు తెలియవు. నేను తిరిగి ...చ్చేసరికి ఈ గోవువంటి ఆవిడను నిర్బంధపెడుతున్నారు. నే నెంత పిలచినా తలుపుతీసినారు కారండీ. అందుచేత నేను బైట నిలిచా నండీ. పౌరాణికుడుగా రామె పాతివ్రత్యము భంగము చేయడానికి ప్రయత్నము చేసేటప్పటికి ఆమె కేక వేసిందండీ.

మూ-గృ—బలే! పౌరాణికులు! తమరు సద్ధర్మప్రచారకులు!

పద్మ—కేకవిని తలుపు విరగదన్ని నేను లోపలికి వచ్చినానండీ. అప్పుడు చండికమ్మ ఆమెను పడద్రోసిందండీ. క్రిందపడగానే ఆమెకు తెలివి తప్పిందండీ. ఈమె యింట్లో ఈమెచేత నేనుతిన్న అన్నము నా బుద్ధి మార్చిందండీ.

చక్ర—చూచారా! బసవరాజుగారూ! ఈవ్యవహారమంతాను. పాపము సాధ్విని తమచేతులారా కష్టముల పాలుచేసినారు (ఆలోచించి) ఏవీ. మీరు తెచ్చిననగలు చూపించండి. (బసవరాజుగారు నగలు చూపును)

విద్యా—ఈ మహారాజుగారి ద్రవ్యభాండారము (మీనాక్షి నగలు యితరుల నగలుతీసి గుమ్మరించును)

చక్ర—బలే. పౌరాణికులుగారూ! ఈ రాక్షసకృత్యములు తమరే చేయనేర్చితిరి. (మహారాజువంకచూచి) మీనాక్షి నగలింకా యిప్పుడు పైకివచ్చినవే, వీటినిగురించి నీవింకా యేమైనా చెప్ప గలవా!

మహా—(ఆలోచించి తనలో) ఇంక దీనికిదే మందు (ప్రకాశముగా. సచ్చిదానంద! సచ్చిదానంద!

చక్ర—(విద్యాధరుడు మొదలగువారితో) ఈయన మహారాజుగద! విశేష మేమైన నుండవలసినదే, జవాబు చెప్పేటట్లు తోచదు. మంచిదే, (రాజభటులతో) ఈ ముగ్గురుని బందిశాలలో పెట్టండి)

సోమ—(త్వరతోవచ్చి) పురాణం సామీ! బండి తెచ్చినాను. అందులో కూర్చుని పదండి అక్కడికి, కాళ్లెందుకు నొప్పి పెట్టించుకోడము.

పౌరా—(చక్రధరునితో) మా మీద వృథాగా యీ నింద మోపడ మయినది. ఏమి పాడుదినాలు దాపరమైనవమ్మా! తల్లీ?

చక్ర—చాలు చాలు. (తీసుకుని వెళ్లండి వీళ్లని అని రాజభటుల కాజ్ఞయిచ్చును)

(మహారాజు; పౌరాణికుడు; చండిక; రాజభటులతో నిష్క్రమింతురు.)

చక్ర—(విద్యాధరునితో) పశ్చాత్తాప మున్నవారికి లేదు.

విద్యా—పరిపూర్ణమైన నీచత్వమిదియే.

చక్ర—అయితే ఆమెకు తెలివి వచ్చినదా ?

పద్మ—(చూచివచ్చి) ఇప్పుడిప్పుడే వచ్చుచున్నది.

చక్క—బసవరాజుగారూ! ఇక మీరామెను యింటికి తీసుకునివెళ్లండి ఒక మేనా తెప్పించండి. నేటికష్టము, దేవుని దయవల్ల ఈ పెద్ద మనుష్యుల సహాయమువల్ల మీ భార్య పుణ్యమువల్ల తప్పిపోయి నది. బసవరాజుగారూ! ఇకమీంద జాగ్రత్తగా ఉంటారు గదా!

(కామాక్షి లేచి యొకప్రక్క నిలువబడును)

విద్యా—జాగ్రత్తగా ఉండవలసినదే, అయ్యా! మన వంటివారే మోస పోయి యీ టక్కరుల వలలో పడుతూ ఉంటే పాపము ఆడువారు మోసపడుట వింతయా!

బసవ—ఇంత పాటుపడినవానికి నాకు కూడా ఈ మాట చెప్పవలెనా. విద్యాధరుడుగారూ! నేడు కలిగిన ఆనందము మీ అందరి దయ చేతనే. ఈ ఋణం నేనెట్లు తీర్చుకొందును ?

విద్యా—బసవరాజుగారూ! ఇందులో ఋణము ఉపకారమూ ఏముం దండీ! మీరు నిజమైన మిత్రులే. ఎవరిసంబంధములోనైనను యీ పనిచేయుట విధాయకమే గదా!

చక్ర—శుష్కపాండిత్యము అందరికీ వచ్చును—గాని విద్యాధరుడు గారూ! మీరుచేసిన పని ఎవరూ చేయలేరు. అయితే సాధార ణముగా జగత్తులోని వ్యవహారములు కనిపెట్టితే ఇల్లాగే ఉంటవి కాని కొందరివి బయటబడును. కొందరివి రహస్యముగా నుండును. ఇంతే తేడా.

విద్యా—తమకెపుడూ యిట్టివారితోనే ప్రసంగములు వచ్చుచున్నం దున తమ అనుభవమును పట్టి తమరు సెలవిచ్చినది బాగానే ఉన్నది. గాని ప్రపంచములో నంతట ఇట్టిద్రోహమే నిండియున్నదని చెప్పు టకు మాత్రము వీలులేదు. అటులయిన జగత్తులో నిలుచుటకు తావే యుండదు. ఈ జగత్తు నిర్మించినవాడు, పాలించువాడు, పరమేశ్వరుడు మనల నందరిని మరచిపోయినాడనే అనవలసి వచ్చును.

గీ. ధర్మమార్గంబు విడనాడు దాంభికులను,
దొడ్డవారిని బాధించు దుర్జనులను,
విశ్వనిర్మాత, శిక్షించి విశ్వమునకు
సౌఖ్యమొనగూర్చు గావుత ! సత్వరంబె.

పంచమాంకము సర్వంబును

సంపూర్ణము



